

శకుంతల

చిత్రకారుడు: కె. కె. నంబియార్.

చ. దయఁగొని ధర్భసూచికపటితంబగు మూతికిఁ గార తైలముం
రయమునఁ బోసి, గాయము కరంబు నయంబుగ మాన్చి చామలం
గయిఁగొని నోరఁ బెట్టి, యొడికంబుగ నెవ్వనిఁ బెంచికొంటివో,
ప్రియసుతుఁ డాకురంగకుఁడు వీఁడు నినుం విడునే సుతామణీ.

[ఆంధ్రాభిజ్ఞాన శాకుంతలము.]




## అసూయ అభివృద్ధిసూచన గాదు

సృష్టియందంతటను గనబడునది పరిణామము. చరాచరులకు దానియెడ మక్కువ గలిగినను, మంటపుట్టినను, దానికై యవి ప్రయత్నించినను ప్రయత్నింపకున్నను కాల పురుషుని సాయమున పరిణామము నిరంతరాయముగా జరుగుచునేయుండును. సృష్టి మూలసూత్రముల నెఱిగి ప్రజ్ఞావంతుడై మానవుడు తనకు గావలసినరీతి క్రమక్రమముగా నభివృద్ధి నందగలడు. ఒకవేళ పురుషు డట్లుగాక స్వార్థపరుడై పరిణామ సిద్ధాంతమును దెలియక అది తనకు దప్ప యితరులకు వర్తింపనిరీతి ప్రవర్తింపదలచుకొన్నచో కాలముకూడ నతనికి సాయపడదు.

పురుషుడు బలవంతుడగుటచే నాదినుండియు స్వార్థపరుడై తనకంటె బలహీనులగుటచే స్త్రీలను మానవులనుగాగాక తన యాస్తివస్తువులవలె పరిగణించుచు తాననుభవించు హక్కులకు దూరముగా నుంచుచువచ్చెను. కాని కాలము జరుగు కొలది మానవుని జ్ఞాననేత్రము విప్పారి నాగరికత యభివృద్ధినొందిన కొలది స్త్రీలు తమ దీనస్థితి మొఱపెట్టియు, పురుషులు తమ దౌర్జన్యములను గుర్తించియు స్త్రీలకు వ్యక్తిత్వమేర్పడి సృష్టిలో ప్రకృతి రూపాది భేదములున్నను స్త్రీ పురుషులు సమానులను యభిప్రాయము ప్రబలి మానవకళ్యాణమునకు ద్రోవజూపినది. ఇది యాదిలో పాశ్చాత్యులందుకంటె ప్రాచ్యులలోనే పొడసూపినది. కాని నేడు పాశ్చాత్య ప్రపంచమే యీ విషయమున మిన్నయైనది.

ఇవ్విధముగ కాలము గడించిన మార్పులను గమనింపక నింకను కృతయుగమునందే యుండవలయునని పట్టుబట్టు దేశములందు వేరొంతు త్రోవగానక పురుషులతో పోరాడి స్త్రీలు తమహక్కులను సంపాదింపవలసివచ్చెను. ఇట్లగుట గమనించియు స్త్రీలు తమ యాటవస్తువులుగా నెంచి వారి యభివృద్ధి కెంతమాత్రమును గమనింపనెనుదీయు దేశీయులస్థితికూడ నిట్టి సంచలనము నెదుర్కొనవలసివచ్చును.

కొంచ మెచ్చుతక్కువగ భారతదేశమీస్థితిలో నున్నదనవచ్చును. ఇది భారతీయుల కమూల్యావకాశము. భారతస్త్రీల కేది యవసరమో పురుషులు గుర్తించి వారి కదియొసగి వారి యభివృద్ధికి తోడ్పడినచో నెట్టిచిక్కులు నుండవు. ఈ సంగతి కొందరు భారతీయులు గుర్తించియున్నందువలననే నేటి స్త్రీలస్థితి మునుపటికంటె కొంచము బాగుపడినది. కాని యింకను సర్వతోముఖాభివృద్ధి గాంచవలసిన యవసరము కించిత్తయిన తగ్గలేదు. ఇపుడిపుడె స్త్రీలు సాంఘిక రాజకీయ వ్యాపారములందు పాల్గొని తమ సోదరీమణులందరభివృద్ధిజెందు మార్గ మన్వేషించుచున్నారు. ఇది దేశసౌభాగ్యమును గోరు పురుషులకు సంతసమును, యుక్తాయుక్తపరిజ్ఞానము మానుషత్వమును మందునకైన దరిజేరనివ్వని కొందరు సనాతనాచారపరాయణుల కతికష్టమును గల్గించుచున్నది. మొన్న మొన్న శాసనసభాసభ్యుడైన సర్ హెచ్. పి. మోడీగారు ఢిల్లీయందిచ్చిన యుపన్యాసము దీని కొక నిదర్శనము.

మొన్న జరిగిన ఎన్నికలందలి యఖండవిజయమున కఖిలభారతదేశము సంతసించినది. పుత్రులతోబాటు పుత్రికలు శాసనసభాప్రవేశార్హతను బొందగలిగిరి గదా యని భారతమాత యానందాశ్రువుల రాల్చినది. వారచట చేయవలసిన కార్యములు పెక్కులున్నను వాటికి సరియగు నధికారము తక్కువయ్యెనేయని యెందరో ప్రముఖులసంతృప్తులుగానున్నారు. ఇట్లుండ నపుడే శాసనసభలందు ప్రవేశించిన స్త్రీలను గూర్చి తమ సంకుచితాభిప్రాయముల వెల్లడించుటకు కొందరు పూనుకొన్నారు. ఇది పవిత్ర భారతమాత దౌర్భాగ్యముదప్ప మరేమి?

మోడీగారు 'ఆధునికస్త్రీ' అను విషయముపై మాట్లాడుచు విద్యావ్యాప్తితోడుగా ఆధునికస్త్రీ విప్లవమును లేవదీసి పురుషుడనాదిగా ననుభవించుచునున్న హక్కులపై దాడిసల్పి యతని నిరుపయోగునిగా జేసివేయుచున్నదనియు, జర్మనీయాది దేశము లిది సహింపక దీని నణచవలయుననెడి తలంపుతో స్త్రీల స్వస్థానములగు గృహాంతర్భాగముల కంపుచున్నారనియు వచించిరి.

మోడీగా రిట్టి విప్లవము లణగద్రొక్కబడుచున్నవని సంతసింపవచ్చును. కాని విప్లవము లేక అట్టిమార్పు గలుగుటకు కారణము శతాబ్దములనుండి నిరంతరము బాధ

పడి గత్యంతరము లేకయుండుటయని యెఱుగరా? వారి కష్టములనెఱిగి తదనుగుణముగ పురుషులు ప్రవర్తించినచో నిట్టి యాకస్మిక మార్పుల కవకాశముండదుగదా! గత్యంతరములేక విప్లవములను లేవదీసిన, బలవంతులైన పురుషులు వారి నణచవచ్చును గాని అంతటితో మరల సమయము చిక్కినపు డట్టిమార్పునుగాని విప్లవమునుగాని ఆ స్త్రీలే కలిగించు నవకాశమునుకూడ నణగద్రొక్కగలరా? దీనికి మోడీగారేమందురో?

ఇట్టి విప్లవము భారతదేశమందు బైలుదేరినదట! దానికి నిదర్శనము పదులు గావలయునని పత్రికలలో స్త్రీలు ప్రకటించుటయు, రాజకీయరంగమున ప్రవేశించుటయు నై యున్నదట! ఇది మోడీగారి యభిప్రాయము. అంతటితో విడువక వారు "దురదృష్టవశమున స్త్రీలుకూడ రాజకీయరంగమున ప్రవేశించి యున్నారు. అది చాలచిక్కులను దెచ్చును. నూతన రాజ్యాంగచట్టమునందు నాతోడి సోదరినిగూర్చి నాకు గలుగు నభిప్రాయమును వెల్లడింప హక్కుగలదా? ఒకవేళ నారీతి ప్రశ్నించిన దిట్టరియైన యేస్త్రీయైనను ననుదూషించిన 'ఒక చెంపగొట్టిన నింకొకచెంప చూపవలయు'ననెడి నానుడికి నే గట్టుపడవలసినదేనా? ఏస్త్రీయైన బహిరంగముగ వెల్లడించిన యభిప్రాయలపై నాకు కోపమువచ్చిన ననాగతమునుండివచ్చుచున్న పురుషులహక్కు నుపయోగించి యసమ్మతి దెలుపక యుండవలసినదేనా?" అని ప్రశ్నించుచున్నారు.

వీరి వాక్యములే సహృదయులకు వారి యాశయములను హృదయమును దెలుపగలవు. భారతస్త్రీలు రాజకీయములందు ప్రవేశించినది వీరి కేమగునోకాని భారతదేశమున కదృష్టమే. పురుష లోక వేశ పరిజ్ఞానములేక అసంగతప్రసంగములు చేసిన స్త్రీలు తమ యసమ్మతిని వెలువరించి వారి కది శాంతయుతముగనే దెలుపుదురనియు, వారి పైబడి అక్కరాయిడి చేయరనియు మోడీవంటివారలకు మే మభయమిచ్చుచున్నాము. అభిప్రాయములు వెల్లడించుటకే యీరీతి భయపడువారు స్త్రీలకు వ్యక్తిత్వము లేదనియు వారు పురుషుల యాటవస్తువులనియు వాదించి తదనుగుణము వర్తించుటకు వెనుదీయకుండు టేల?

ఈ రీతి నుపన్యసించిన వీరు కడపట "తెలివితక్కువగా 'అబల'ను స్త్రీనిగూర్చి నేనెంతయో నెఱిగినవాడ ననుకొంటినిగాని నాకున్న యనుభవమంతయు దీని నబద్ధము చేసి నా కేమియు దెలియదనుకొనవలసి వచ్చినటుల జేయుచున్న" దన్నారు. దీనితో మే మేకీభవింతుము. ఇట్టివారి కనైన భారత స్త్రీల సరిగా నర్థముచేసికొని తమ సంకుచితాభిప్రాయములకు చోటివ్వక విశాలహృదయులై వారియున్నతికి — దానిమూలమున తమయున్నతికి — కృషిచేయుదురుగాక.

# శాసనసభ కెన్నుకొనబడిన సభ్యురాండ్రు

నూతన రాజ్యాంగ సంస్కరణముల ననుసరించి యిటీవల జరుపబడిన యెన్నికలందు మదరాసు రాష్ట్రమునందు శాసన సభకు తొమ్మిదిమంది స్త్రీలెన్నుకొనబడిరి. వారి కందరికిని 'గృహలక్ష్మి' యభివందనము లర్పించుచున్నది.

చెన్నరాష్ట్రమున స్త్రీనియోజకవర్గము లెనిమిది. వానిలో నొకటి భారతీయక్రైస్తవులకును, మరొకటి మహమ్మదీయులకును ప్రత్యేకింపబడినవి. జనరల్ స్థానములకు శ్రీమతి లక్ష్మీదేవిగారు మాత్రము పోటీచేసిరి. ఈ తొమ్మిదిస్థానములకు కాంగ్రెసువారెనిమిదిమందిని నిల్పిరి. వారందరు విజయమందిరి. తొమ్మిదవవారగు శ్రీమతి ఖదీజాయాకూబ్ హుస్సేనుగారు చెన్నపురి మహమ్మదీయ స్త్రీనియోజకస్థానమునకు స్వతంత్రులుగా నిల్చి గెలుపొందిరి. కాంగ్రెసునిల్పిన స్త్రీఅభ్యర్థులందరు ఎక్కువ మెజారిటితో గెలుపొందిరి. వారిని గూర్చిన వివరములు క్రింద గలవు.

### శ్రీమతి రుక్మిణమ్మగారు

1920 నందు క్రైస్తవమహిళాకళాశాలయందు పట్టపరీక్ష నిచ్చిరి. భారత స్త్రీ మహామండలి కార్యదర్శిగా నుండిరి. 1926 వ సం॥ జూనునెల స్త్రీల ఎన్నికలను గూర్చి చర్చించుటకు ప్యారిసునందు జరిగిన అంతర్జాతీయ స్త్రీసమావేశమునకు డెలిగేటుగా వెళ్లిరి. చెంగల్పట్టు డిస్ట్రిక్టుబోర్డు సభ్యురాలుగను, మదరాసు విశ్వవిద్యాలయ సెనేటు సభ్యురాలుగను పనిచేసిరి. హిందూస్త్రీ సంస్కరణవిషయమున చాల కృషిచేసిరి. సత్యాగ్రహమునందు రెండు మార్లు జైలుకు వెళ్లిరి. 1935 నందు లెజిస్లేటివు కౌన్సిలు సభ్యురాలుగా నెన్నుకొనబడిరి. ఇపుడు చెన్నపురి స్త్రీలస్థానమునకు ఎన్నుకొనబడిరి. వీరికి వచ్చిన ఓట్లు 24182. ప్రత్యర్థియగు శ్రీమతి అలమేలుమంగ తాయమ్మాళుగారికి 5380.

### డాక్టరు ఎస్. లక్ష్మీదేవమ్మగారు

ఈమె సంఘసంస్కరణాభిలాషిణి. శ్రీయుత ఎ. మృత్యుంజయశాస్త్రి, బి.ఎ. బి.ఎల్.గారి ధర్మపత్ని. 1930 సం. నుండి కాంగ్రెసులో పనిచేయుచు ఒక సంవత్సరము చెరసాలకు వెళ్లిరి. కొంతకాలము కాంగ్రెసు సంఘమునకు ఉపాధ్యక్షులుగా నుండిరి. వీరు బళ్లారి స్త్రీనియోజకస్థానమునకు ఎన్నుకొనబడిరి. వీరి ఓట్లు 4877. ప్రత్యర్థికి 2348.

### శ్రీమతి గంథం అమ్మన్న రాజాగారు

వీరు ఏలూరు స్త్రీనియోజకస్థానమునకు నిల్చి ప్రత్యర్థులగు కోటీశ్వరమ్మ, కమలమ్మ గారలను ఓడించి విజయమందిరి. వీరి ఓట్లు 3663. ప్రత్యర్థులవి వరుసగా 1310, 152.



శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు



శ్రీమతి గంధం అమ్మన్నరాజాగారు



డా॥ ఎన్. లక్ష్మీదేవమ్మ



శ్రీమతి ఖదీజాయాకూబ్ హుసేన్‌గారు



మిసెస్. హౌమార్టిన్ సంతాననిరోధమునుగూర్చి బొంబాయికార్మిక స్త్రీ సంఘమున
నుపన్యసించినపుడు దీయబడిన ఛాయాపత్రము. వారు కుడివైపున
నాల్గవవారుగా నిల్చియున్నారు.



లేడీ బీమాంట్ గారి యధ్యక్షతక్రింద బొంబాయి గర్ల్ గైడ్స్ జపాను
నృత్యమును ప్రదర్శించుట.

### శ్రీమతి ఖదీజాయాకూబ్ హుస్సేన్ గారు

సుప్రసిద్ధ కాంగ్రెసువాదియైన యాకూబ్ హుస్సేన్ గారి ధర్మపత్ని. వీరు టర్కీదేశీయులు. తన వివాహానంతరము స్వదేశమందలి సంస్కరణము మహమ్మదీయ స్త్రీలయందు ప్రవేశపెట్టవలయునని కృషి చేయుచున్న మహిళామణి. చెన్నపురి మహమ్మదీయ స్త్రీనియోజకస్థానమునకు నిలువబడి గెలుపొందిరి. వీరి ఓట్లు 3357. ప్రత్యర్థికి 3352. వీరు స్వతంత్రముగనే పోటీ చేసిరి. వీరి భర్తయగు యాకూబ్ హుస్సేను గారుకూడ శాసనసభ కెన్నుకొనబడిరి.

### శ్రీమతి జీవమణి మాసిలామణి పిళ్లెగారు

వీరు కాంగ్రెసు ఉద్యమమునందు చాల కాలమునుండియు పనిజేయుచు ట్యూటికోరినందు మిగుల పలుకుబడిగల శ్రీయుత మాసిలామణీ పిళ్లెగారి సతీమణి. వీరెల్లపుడు భర్త కార్యక్రమమందు తోడ్పడి ప్రజాసేవకు పాటుపడిరి. తిన్నవేలి, పలంకోట భారతీయ క్రైస్తవస్త్రీ నియోజకస్థానమునకు నిల్చి గెలుపొందిరి. వీరి ఓట్లు 3680, ప్రత్యర్థికి 1690.

### శ్రీమతి లక్ష్మీకృష్ణస్వామి భారతిగారు

కాంగ్రెసునం దుత్సాహముగా పని చేయు భారతీయదంపతులలో వీరొకరు. వీరు భర్తతోకూడి కాంగ్రెసోద్యమమందు పాల్గొని చెరసాలవాసము చేసిరి. దిండికల్ నియోజకస్థానమున గెల్చిరి. ఓట్లు 8137. ప్రత్యర్థికి 255 మాత్రము. వీరి భర్తగారు కూడ శాసనసభకే ఎన్నికల యందు ఎన్నుకొనబడియున్నారు.

### శ్రీమతి లక్ష్మీశంకరయ్యరుగారు

10, 12 సంవత్సరములుగా భార్యాభర్తలు కాంగ్రెసోద్యమమునందు పనిజేసిరి. వీరు తిన్నవేలి రూరల్ స్థానమునకు జస్టీసు నాయకులును మిగుల పలుకుబడిగలవారు నగు ఐ. సి. ఈశ్వరణపిళ్లెగారితో పోటీ చేసి అధికమెజారిటితో గెల్చిరి. జెనరల్ సీటుకు ఎన్నుకొనబడిన స్త్రీ వీరొకరే. వీరి భర్తగారుకూడ యెన్నుకొనబడిరి.

### శ్రీమతి అంజల అమ్మాళ్ గారు

పదునైదు సంవత్సరములుగా కాంగ్రెసునందు కుటుంబసహితముగా పాల్గొని చెరసాలవాసముకూడ జేసిరి. కడలూరు స్త్రీ నియోజకస్థానమునకు నిల్చిరి. వీరి ఓట్లు 15518; వీరి ప్రత్యర్థికి 1157.

### శ్రీమతి అమ్ముకుట్టి అమ్మాళ్ గారు

కాలికట్ – టెల్లిచ్చేరి స్త్రీనియోజక స్థానమునకు నిల్చి గెలుపొందిన కాంగ్రెసు సభ్యురాలు. వీరి ఓట్లు 8261. ప్రత్యర్థికి 2095.

# గృహలక్ష్మీ కంకణార్హత

ప్రథమ ద్వితీయ తృతీయ మెల్లజయంత్యుత్సవసందర్భములందు 1934, 1935, 1936–వ సంవత్సరములలో నాంధ్రపాఠక లోకమునకు చిరపరిచితులును సుప్రసిద్ధరచయిత్రులును అగు శ్రీమతులు కనుపర్తి వరలక్ష్మమ్మ, చిలకపాటి సీతాంబ, కంచనపల్లి కనకాంబగారలకు గృహలక్ష్మి కంకణమును బహూకరించిన విషయ మెల్లరికిని దెలిసినదే. ఆంధ్రరచయిత్రుల నాదరించి ప్రోత్సహించుచు నామూలమున మహిళాభ్యుదయమునకు పాటుబడుట కంకణ బహూకరణోద్దేశమని యిదివఱకే గృహలక్ష్మి నిర్వచించియున్నది. ఈ యుద్దేశము నిరంతరాయముగా కొనసాగుటకై ప్రతిసంవత్సరమిట్టి బహూకరణములు విడువక జరుగవలసియుండును. ఆ రీతిగా నొనర్పుటకు 'గృహలక్ష్మి'యువ్విళ్లూరుచునే యుండును. ఆవిధముగనే దానిని గ్రహించుటకును, ఆ యుద్దేశ్యముల నెరవేర్చుటకును ఆంధ్రసోదరీమణులుకూడనువ్విళ్లూరుచుండవలెను; గృహలక్ష్మికి తోడ్పడవలెను.

పై గనబరచిన విదుషీమణులవంటి యాంధ్రనారీమణులింకను పెక్కు మంది గలరనుమాట సత్యేతరముగాదు. వారి జాడల వర్తించి యట్టి విదుషీమణులు రచయిత్రులు పెక్కుమంది బైలుదేరి యాంధ్రావని నలరింపవచ్చును. వారందరీ గృహలక్ష్మి కంకణముబొంద నర్హులై యున్నారు.

ఈ కంకణము సుప్రసిద్ధరచయిత్రులకరమలంకరింప గాచుకొనియుండ వారందరిద్దాని కేల ప్రయత్నింపగూడదు? ఇంతవఱకావిషయము తెలియదని యెవరు ఆలసింపజనదు. నేటి నుండియే ప్రయత్నింపనగు. అట్టి వారందరీ ప్రకటనను గమనింతురుగాక. ఇదివఱకు కంకణార్హత బొందినవారిట్టి గౌరవము బొందుటకు వారు రచించిన పలువిధములగు రచనలును, వారొనర్చిన భాషాసేవయు కారణమైయున్నదని అందరికి దెలిసియేయున్నది. ఇకపై కంకణార్హత బొంద దలంచువారీ విషయములతోపాటు ఇంకొకటికూడ నిర్వర్తింపవలసియుండునని మనవి.

సాధారణముగా కంకణ బహుమతి సంవత్సరాంతమున, డిశంబరుమాసములో జరుగుచుండును. దానికెందరేని యేకకాలములో ప్రయత్నింపవచ్చును. వారాసంవత్సరారంభమునుండియు గృహలక్ష్మియందు ఐదారుపుటలకు మించని వ్యాసముల రచింపుచుండవలెను. అట్లు ప్రకటింపబడిన వ్యాసములు సంవత్సరాంతమున పోటీచేసిన ఇతరుల రచనలతోబాటు పరీక్షింపబడును. అపుడు ఉత్తమ వ్యాసముల సంఖ్యయు, విలువయు, వారదివఱకు రచించి ప్రకటించి

యున్న పుస్తకములాది రచనలును భాషాసేవయు, గణింపబడును. ఆసంవత్సరము కంకణార్హతకై ప్రయత్నించిన వారియందీ విషయముల నెవరు ప్రథములుగ కృతకృత్యులగుదురో ముందుగనే ప్రకటింపబడి కంకణ బహుమతి నిశ్చయింపబడును.

వ్యాసములు రసవత్తరములై గద్యాత్మికములై యుండవలయును. వ్రాయవలసిన విషయములువారే యేర్పరుకొనదగును; కాని సాంఘిక రాజకీయార్థిక విషయములైనను సారస్వతవిషయములైనను స్త్రీల యభ్యుదయమునుగూర్చి చర్చించునవియై యుండవలయును.

1937 వ సంవత్సరము డిశంబరుమాసమున నొసగబోవు గృహలక్ష్మికంకణమునకు అర్హత సంపాదింపబోవు సోదరీమణులందరిప్పటినుండియే పైన వ్రాసిన విషయముల గమనించి వ్యాసరచనకు బూనుకొనవలెను. ఆవిషయమును ముందే మాకార్యాలయమునకు దెలుపుకొని వారిదివఱకుచేసిన భాషాసేవ, రచనలు, వాని ప్రతులు పంపుకొనవలయును.

ప్రతి నెలయందును వ్యాసములు 15 వ తేదిలోపలనే పంపుకొనవలయును. అవి ప్రకటనార్హముగాకున్నచో వెంటనే త్రిప్పి పంపబడును. కంకణమునకై పోటీచేయు వారినిగూర్చి గాని తత్సంబంధమైన విషయములనుగురించి కాని ఉత్తర ప్రత్యుత్తరములు పెంచకుండుట లెస్స. ఈ యవకాశమును బురస్కరించుకొని సోదరీమణులందరు కంకణార్హతకై ప్రయత్నింతురుగాక.

## గృహలక్ష్మి చిత్రప్రశ్న




86 వ పేజీ చూడుడు.

# గృహలక్ష్మి చిత్రప్రశ్న

85 వ పుటలో ముద్రింపబడిన కూపనులో 9 యిండ్లుగల చిత్రముగలదు. దానిలో నే వైపునుండి కూడినను 18వ సంఖ్య వచ్చురీతి అంకెలను వేయవలయును. ఒకమారువేసిన అంకెను తిరిగి వేయకూడదు. ఒక్కొక రిట్టిప్రతుల నెన్నేని బంపవచ్చును కాని ప్రతిసమాధానము గృహలక్ష్మి కూపనునందే యుండవలయును. వేరుగా బంపినను, ఏప్రెల్ 15వ తేదికి తరువాత మాకు చేరునట్లు పంపినను ఆ సమాధానము లంగీకరింపబడవు. ఆసమాధానములలో మావద్ద సీలుచేయబడియున్న దానితో సరిపోవు దానికి గృహలక్ష్మి సంచిక యొక సంవత్సర ముచితముగా పంపబడును. స్త్రీలు మాత్రమిందు పాల్గొనఁగును. ప్రవేశరుసు మేమియు లేదు. ఫలితములు రాబోవు సంచికలో ప్రకటింపబడును.

గత సంచికయందలి చిత్రప్రశ్నకు సమాధానము: వి నీ ల కు ం త ల ము

బహుమతి బొందినవారు: శ్రీమతి బి. లక్ష్మిబాయి.

,, స. నాగరత్నము.

పైవా రిరువురి సరియగు సమాధానములు మాకు మొదట అందినందున ఆరుమాసములు గృహలక్ష్మి సంచికలు వారి కుచితముగా పంపబడును.

పై ప్రశ్నకు సరియగు సమాధానము లిచ్చిన యితరుల పేరులు క్రింద పేర్కొనుచున్నాము. గృహలక్ష్మి కూపనులలోగాక వేరుగా వ్రాసినవారి సమాధానములు లెక్కింపబడలేదు.

కడియాల సరస్వతి, జి. పి. సరస్వతి, కోకా కృష్ణవేణమ్మ, ఎమ్. లక్ష్మిబాయి, చెరుకూరి సూర్యనారాయణమూర్తి, పెండ్యాల శేషమ్మ, రాళ్లబండి నరసింహాచార్యులు, వేలాల ధర్మారావు, సి. రామేశ్వర్, పి. వెంకమ్మ, గోపు ఆదినారాయణమ్మ, కాకులపాటి రాధాసుందరమ్మ, నూకలపాటి వజ్రాంబ, పాకల చంద్రకాంతామణి, మాగంటి శకుంతలాదేవి, పాలూరి రామారావు, జమ్మి సీతమ్మ, వద్దిపర్తి శకుంతలాదేవి, చీమలకొండ సూర్యకాంతమ్మ, కోకా హనుమాయమ్మ, లలితకుమారి, ఎస్. లీలావతి, పి. అప్పయ్యశాస్త్రి, వెంకటరంగనాయకమ్మ, మ. సౌభాగ్యవల్లి, పండితారాధ్యుల నాగభూషణము, సత్రాజు రమాదేవి, వల్లభనేని వెంకటసుబ్బమ్మ, తోలేటి సత్యవతి, గోవిందు వెంకటభారతమ్మ, కప్పగంతుల బ్రహ్మానందం, కమలకుమారి, కాజ దత్తయ్యపంతులు, మల్లంపల్లి సతీదేవి, దణ్యంరాజు వీరరాజు, కామరాజు మైత్రేయి, తాత వెంకట పద్మావతి, భాస్కర్ల లలితాదేవి, బొడ్డుపల్లి కమలాబాయి, గొల్లపూడి జోగారావు, ద్రోణంరాజు జానకీదేవి, ఓలేటి సత్యవతీదేవి, పి. జానకమ్మ, మదిర శకుంతల, దర్భా వెంకటరత్నమ్మ, ఆర్కాలు సత్యవతీబాయి, గంటి కృష్ణవేణమ్మ, వి. యల్. నరశింహరావు, కె. సీత, కోతి తులశమ్మ, చిట్టి, వం. కం. రుక్మిణమ్మ, యమ్. సూర్యప్రకాశరావు, మందపాటి సీతామహాలక్ష్మి.

# భారతనారి — పాశ్చాత్యనారి

స్వామివివేకానంద

(గత సంచిక తరువాయి)

దోషములు కావలసినన్ని మన సంఘమునను న్నవి, వారి సంఘమునను న్నవి. ఇట ఒక్కొక్కప్పుడు విధవల అశ్రుపాతమున ధర ఆర్ద్రమైపోవుచున్నది. అట అనూఢలగు కుమారికల దీర్ఘవిశ్వాసముల వాయువు విషాక్తమైపోవుచున్నది. ఇట జీవితము దారిద్ర్యవిషమున శిథిలమగుచున్నది. అట భోగవిలాసముల అవసి జాతి జీవన్మృతప్రాయమగుచున్నది.

నేను పురుషులకు జెప్పుదానినే స్త్రీలకును జెప్పెదను.

భారతదేశమున భారతీయధర్మమున శ్రద్ధావిశ్వాసముల నుంచుడు. తేజస్వినులుగండు. ఆశతో నడుములు బిగింపుడు. భారతమున జన్మమని సిగ్గిలక గౌరవముగ భావింపుడు. ఇతరజాతులనుండి కొంచెము కొంచెముగ మనము గ్రహింపవలసిన విషయములున్నను, ఇతర జాతులకంటె వెయ్యిరెట్లెక్కువగ జగత్తున కీయవలసినదున్నదని గుర్తునందుంచుకొనుడు.

హీనభావమే ఒక రోగము, ఇదేమి దైన్యమా లేక గుప్తముగనున్న అహంకారమా? 'నలింగం ధర్మ కారణం సమతా సర్వభూతేషు ఏతన్ముక్తస్య లక్షణమ్.' 'అస్తి అస్తి, సోహం సోహం, చిదానంద రూపః శివోహం శివోహం.' 'నిర్గచ్ఛతి జగజ్జాలాత్ పింజరాదివ కేసరీ.' 'నాయమాత్మా బలహీనేనలభ్యః' తుషారప్రవాహము (Avalanche)వలె ప్రపంచముపై పడుము—జగత్తు పటపట బ్రద్దలైపోవుగాక, హరహరమహాదేవ. ఉద్ధరాదాత్మ నాత్మానమ్.

అమెరికాయువతు లెంత పవిత్రలు! పాతిక ముప్పదియేండ్లు దాటినదే వివాహముకాదు. ఆకాశమున నెగురు పక్షులవలె స్వతంత్రులు. సంతయందు దుకాణముల పనిచేతురు; కాలేజీలలో ప్రొఫెసర్లు. కాని మచ్చలేని శీలము. డబ్బున్నవారు లేదసాదలకు ఉపకారమొనర్ప తీవ్రముగ యత్నింతురు. ఇక మనమో! పదేండ్లు మీదబడిన పెళ్లిచేయకపోయిన పాడయిపోదును! మనము మనుష్యులలో లెక్కా?

ఆదేశపు అవివాహితయువతులు చాలమంచివారు; ముగ్ధలు. వారిని బోలువారిని నేను మరెచ్చటను గాంచలేదు. మన దేశమున సత్పురుషులు చాల మంది; కాని ఇట్టియువతులు చాలతక్కువ. 'ఆదేవి సుకృతియగు పురుషుని గృహమున లక్ష్మివలె విరాజిల్లుచున్నది.' ఈమాట నిక్కము. హిమధవళలగు యువతుల ననేకుల గాంచితిని. వీరి కెట్టి స్వాతం

త్ర్యము! పనులన్నిటిని వారే యొనర్తురు. మార్కెట్లు, కాలేజీలు వీరితో నిండియున్నవి. ఈ పాడు దేశమున యువతులు వారివెంట నడువ వీలులేదు. అమెరికన్ యువతులదయ నెట్లు వర్ణింతును. నేనటనుండిన వన్నిదినములు ఇంట తావొసంగిరి. తిననిచ్చిరి. ఉపన్యాసముల నొసంగ వీళ్లు కల్పించిరి. వెంటనిడికొని బజారునకు దీసికొని వెళ్లిరి. వారొనర్చని దేమి యున్నదో వచింపజాలను. వందలకొలది జన్మము లెత్తి సేవనొనర్చినను, వారి ఋణమును దీర్చజాలను.

ఈ అమెరికన్ రమణులు ఇతరదేశీయ రమణుల కంటె గొప్పలు. అదేకాదు. అమెరికన్ పురుషుల కంటెగూడ. ధనార్థము పురుషుడు తన జీవితమంతయు దాస్యశృంఖలముల బంధించుకొనుచున్నాడు; స్త్రీ ఈ అవకాశమును పురస్కరించుకొని తన ఉన్నతి కొఱకు పాటుపడుచున్నది. పృథివియందలి మఱే ఏ ఇతరదేశమునను స్త్రీల కింతటి అధికారము లేదు. క్రమముగ అన్నింటిని తమ చేతులలోనికి లాగుకొనుచున్నారు. పురుషులకంటె స్త్రీలసంఖ్యయే విద్యావిషయమున అధికము. అయితే, ప్రతిభాశాలురు ఎక్కువగ పురుషులలోనే కన్పడుదురు.

ఆదేశపుపిల్లలు చిరుతవయస్సుననే పనిపాటల నొనర్పబోదురు. యువతులు యూనివర్సిటీలలో విద్యను నేర్తురు. ఫలితము: ఒక్కొక్కసభలో నూటికి తొంబదిమంది స్త్రీలేయుందురు. యువకులు వారి కాలిగోటికి పోలరు. ఈయువతులు జాతియోన్నతికి ప్రతినిధులు. పురుషులు కార్యపరతంత్రులగుటవలన విద్యావిషయముల మనస్సును లగింపలేరు. మహిళాగణమే గొప్పగొప్ప కార్యములకు జీవనము.

శాక్తేయశబ్దార్థము తెలుంగుదువా? శాక్తుడన కల్లు త్రావువాడని కాదు. శాక్తుడన జగత్తున ప్రకాశించు మహాశక్తి అంతయు ఈశ్వరుడని ఎఱుంగువాడు. స్త్రీజాతియందంతటను ఆశక్తియొక్క వికాసమును గాంచువాడు. వీ రట్లే కాంతురు. మనువనినాడు: 'యత్రనార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః' వీ రిట్లే యొనర్తురు. అందువలననే వీరు సుఖులు, విద్యావంతులు, స్వతంత్రులు, యత్నశీలురు. మనము స్త్రీలను నీచలుగ, అధములుగ, అతిహేయముగ, అపవిత్రముగ జూచుచున్నాము. దీని ప్రతిఫలము: మనము పశువులమై, దాసులమై, యత్నరహితులమై, దరిద్రులమై పడియున్నాము.

వీరి ధర్మమే శక్తిపూజ, కొంచె మించుమించుగ వామాచారము; పంచమకారములలోని తుది దానిని విడచిన — 'వా మేవా మా.....దక్షిణే పానపాత్రం.... అగ్రే న్యస్తం మరీచసహితం సూకరస్యోష్ణమాంసం.... కౌలోధర్మః పరమగహనో యోగినామప్యగమ్యః.' 'సర్వసాధారణముగ బయటికి గనుపడు శక్తిపూజ వామాచారమే—మాతృభావముకూడ విరివిగనున్నది. ప్రొటెస్టెంటు మతమునకు యూరప్‌న ప్రాధాన్యము లేదు. అచ్చట మతము కాథలిక్కు మతము. ఆ మతమున ఏసు, త్రికము, జహోవా ఇవన్నియు నిద్రితములు; జాగరిల్లియున్నది 'మాత' ఒక్కటియే. పలుచోట్ల, పలురకముల, పెక్కురూపముల, హార్మ్యముల, మందిరముల, పథప్రాంతముల, పర్ణకుటీరముల 'మాత, మాత, మాతా!' బాదుషా పిలుచుచున్నాడు 'మాత'. సేనాపతి పిలుచుచున్నాడు 'మాత'. తుపాకి చేతగొని సైనికు డరచుచున్నాడు 'మాత'. నౌకామధ్యమమున నావికు డనుచున్నాడు 'మాత'. దారిలో బిచ్చగాడు కేకపెట్టుచున్నాడు 'మాత'. జీర్ణవస్త్రమును ధరించిన జాలరి అనుచున్నాడు 'మాత'. "తల్లీ" — 'ధన్యరాలు మేరీ', 'ధన్యరాలు మేరీ'. రాత్రిందివములు ఈధ్వనులు లేచుచున్నవి. ఈ శక్తిపూజ కేవలము కామపూజ కాదు. మన దేశమున కాశీ, కాళీఘట్టాది తీర్థస్థలములలో కుమారిక (అవివాహితకన్య)లకును, సధవ (జీవితభర్తృక)లకును జరుపు వాస్తవిక ప్రత్యక్షపూజ, కాల్పనికము కాదు. ఇట్టిపూజ అట జరుగుచున్నది. మనపూజ తీర్థస్థాన

ములలోనే, అనిముషమే. వారిపూజ రాత్రిందినములు, ద్వాదశమాసములు. ప్రథమస్థానము స్త్రీలకు, ఎట్టిదైనను కానిమ్ము. పరిచయముండనీ, ఉండక పోనీ; గొప్పకుటుంబమునకు జెందినవారియొక్కయు, రూపయౌవనములు గలిగినవారియొక్కయు సంగతి వేరుగ చెప్పనక్కరయే లేదు. 'మూరు'లు స్పెయిన్ పై దండెత్తి అట ఎనిమిది శతాబ్దములు పరిపాలించి నప్పటినుండి ఈపూజ ఆరంభమైనది. వారు మొమ్మొదట శక్తికి వసనభూషణ భోజనఆసనాదుల నొసంగి సమ్మానించెడువారు. అప్పటినుండియే యూరప్‌న సభ్యత వికసింపసాగినది. శక్తిపూజ ఉదయించినది. 'మూరు'లు మరచిపోయినారు. శక్తిహీనులు, శ్రీహీనులైనారు. స్థానచ్యుతులై ఆఫ్రికాలో నొక మూల నివసింపసాగిరి. ఆశక్తి యూరప్‌న సంక్రమించినది; మాత ముసల్మానుల విడచి, క్రిస్టియనుల గృహమును వరించినది.

స్త్రీ సంబంధములగు ఆచారము లన్నిచోట్ల ఒకేతీరుగనున్నవి; పురుషులు స్వైరులగుట తప్పు కాదు, స్త్రీ స్వైరిణియయిన మహాదోషము. కాని, ఫ్రెంచివారి కంత పట్టింపులేదు. యూరప్‌నందలి జనసాధారణముగూడ ఈవిషయమున అంతగ తల పోయరు. అవివాహితులపక్షమున ఇది దోషమే కాదు. విద్యార్థివిషయవిరతులైన చాలపట్ల తల్లిదండ్రులు దోషముగ పరిగణింతురు. వారు పురుషుని కడ గోరునది సాహసము. వీరి virtue శబ్దమును, మన వీరత్వమును ఒక్కటియే. ఈ శబ్దచరిత్రమును గమనింపుము. వీరవరిని పురుషుడందుకే తెలియవచ్చును. కాని, స్త్రీకి సతీత్వ మవసరమే. మన ఉద్దేశ్యము ఏతద్వ్యతిరిక్తము, మన విద్యార్థి (బ్రహ్మచారి) శబ్దమును, కామజయత్వమును నొక్కటియే. విద్యార్థి—కామజిత్ అనిన ఒకేమాట.

మన ఉద్దేశము మోక్షము బ్రహ్మచర్యము లేనిచో అదెట్లు లభించును? వారి ఉద్దేశ్యము భోగము, బ్రహ్మచర్యములో అవసరమంతగ లేదు. స్త్రీయొక్క సతీత్వము నాశనమైన సంతానము కలుగదు, జాతి ధ్వంసమైపోవును. పురుషుడు పదిమందిని పెండ్లిచేసికొనినను నష్టములేదు పైగా వంశమువృద్ధి చెందును. స్త్రీల విషయమున నిట్లుగాదు. ఇట్లయిన ఫలము వంధ్యత్వము. అందువలననే అన్నిదేశములవారును స్త్రీల సతీత్వముపై కన్నుంచినారు. పురుషుడు పంచసాగినాడు. 'ప్రకృతిం యాంతిభూతాని నిగ్రహం కింకరిష్యతి.'

భారతవర్షమున పత్ని భర్తను ప్రేమించునట్లు పుత్రునిగూడ స్వప్నముననైన ప్రేమింపజాలదు. ఆపె పతి అననగును. కాని మరల పురుషుడు తల్లిని ప్రేమింపగలిగి నంతగ భార్యను ప్రేమింపజాలడు. కనుక ఈప్రేమ పరస్పర సాపేక్షరహితమగు పవిత్ర వస్తువుగ గ్రహింపబడజాలదు. ఇది విక్రయము. భార్యాభర్తలు సర్వదా ఏకత్రఉండుట సమీచనముగ పరిగణింపబడకున్నది. ఈ విషయమును మనము పాశ్చాత్యులకడనుండి గ్రహించి, మన ఆదర్శము నొకింత నూతనమొనర్చుకొనవలసియున్నది. వారు మననుండి మాతృభక్తిని గ్రహించుట ఆవశ్యకము.

దోషములు కావలసినన్ని మనసంఘముననున్నవి, వారి సంఘముననున్నవి. ఇట ఒక్కొక్కప్పుడు విధవల అశ్రుపాతమున ధర ఆర్ద్రమైపోవుచున్నది. అట అనాథలగు కుమారికల దీర్ఘనిశ్వాసముల వాయువు విషాక్తమైపోవుచున్నది. ఇట జీవితము దారిద్ర్య విషమున శిథిలమగుచున్నది. అట భోగవిలాసముల అవసి జాతి జీవన్మృత ప్రాయమగుచున్నది.

మీరు వివిధదేశములు తిరిగియున్నయెడల, ఒక జాతి తమదోషముల నొకరీతిగను ఇంకొకజాతి మరొక రీతిగను దిద్దుకొన యత్నించుచున్నదని కనుగొనగలరు. ఒకే దోషమును విభిన్నోపాయముల నవలంబించి దిద్ద యత్నించినను, ఏయొక్కరును కృతకృత్యులు గాలేదు.

ఒకమూల సవరించిన మరొకమూల విరిగిపడుచున్నది. దీనిగతి ఇట్లేయుండును. హిందువులు సతీధర్మరక్షణార్థము బాల్యవివాహముల నొనరించి, జాతినంతటిని నిర్వీర్యమొనర్చి వైచినారు. కాని బాల్యవివాహము సతీత్వధర్మమును గాపాడలేదని చెప్పజాలము. ఇందు నీ వెద్దానిని గ్రహింతువు? బాల్యవివాహమొనర్చి సతీత్వమును రక్షింతువా—అయిన జాతి నిర్వీర్యమై పోవుచున్నదే! మఱి పాశ్చాత్యులిట్టి ఆపదలనుండి నెగ్గి బయటపడినారందుమా? అట్లుకాదే. ఏమన సతీత్వమే జాతియొక్క జీవనశక్తి. జాతియొక్క మృత్యుచిహ్నము సతీధర్మనాశనమునుండియే వచ్చుచున్నదని నీవు ఇతిహాసమున (History) గనుగొని యుండలేదా? సతీధర్మము అడుగంటిన వినాశకాలము దాపురించినదన్నమాటే. ఈ దుఃఖకర ప్రశ్నల మీమాంస నెటకనుగొనగలము? తలిదండ్రులు వధూవరులను నిర్వచించిన, ఈ ప్రేమదోషము లొంకింత తగ్గిన తగ్గవచ్చును. కాని, వధూవరులు తమకుదామే వరించుకొనిన సుఖమంతగ లభింపదు. భారతీయ నారులు విశేషముగ సుఖించుచున్నారు. భార్యాభర్తలనడుమ సాధారణముగ కలహములు లేవు. పక్షాంతరమున, అత్యంతస్వాతంత్ర్యదేశమగు అమెరికాయందు అంతఃకలహములులేని కుటుంబమే లేదు. సుఖించుచున్న సంసారములు బొత్తుగ లేవనికాదు; కాని, వగరుచున్న కుటుంబముల సంఖ్య గణనాతీతము. నేనరిగిన ప్రతిసభయందు వినవచ్చిన స్త్రీలలో మూడవ వంతు భర్తలను, పుత్రులను ద్యజించినారని వింటిని. ఇట్లే సర్వత్ర ఈవిషయమేమి వెల్లడించుచున్నది? ఈ ఆదర్శములవలన అధికసుఖము లభించుటయే లేదు. మనమందరము సుఖముకొరకు విశేషముగ యత్నించుచున్నాము. కాని సుఖము లభింపకమునుపే ఇంకొకవైపున దుఃఖము గలుగుచున్నది.*

ప్రతిజాతికి ఒకానొక నైతికజీవనోద్దేశ్యమున్నది. దాని ననుసరించియే ఆయాజాతులను బరిశీలింపవలసియున్నది. భిన్నభిన్నదృష్టులతో బరికించుటతగదు.

నవ్యభారత మనుచున్నది : వివాహవిషయమున మాకు సంపూర్ణస్వాతంత్ర్యముండవలెను, మాభవిష్యజ్జీవన కష్టసుఖములతో గూడుకొనిన విషయము, మా ఇచ్చకు వచ్చినట్లొనర్చుకొనెదము. ప్రాచీనభారత మాదేశించుచున్నది: వివాహము ఇంద్రియ సుఖముకొఱకుగాదు వంశోత్పాదనకు అని. ఇదియే ఈదేశముయొక్క అభిప్రాయము సంతానోత్పాదనవలన నీవు సంఘముయొక్క భవిష్యత్తునకు కారణుడవగుచున్నావు. అందువలన సమాజమునకు శుభముచేకూరుపద్ధతియే ఆచరణయందున్నది. 'బహుజనహితాయ'. నీవు నీసుఖభోగేచ్ఛను త్యజింపుము.

ఈ పాశ్చాత్యనారీ ప్రశంసనుగాంచి, మనదేశపు యువతులు అత్యంతహీనదశయందున్నారని తలపోయకుందురుగాక. మనదేశమున గడచిన శతాబ్దములలో నున్న పరిస్థితులనుండి రక్షించుటకు స్త్రీలను మాటున నుంచవలసివచ్చినది. ఈ సత్యమును మనమ్మనమంచుకొని మన సంఘముయొక్క రీతినీతులను పరీక్షింపవలెను; స్త్రీలు హీనలను సిద్ధాంతమును బురస్కరించుకొని కాదు.

నేను జాతియొక్క రెండు పెడలను గాంచినాను ఏజాతి సీతాదేవిని బ్రసవించినదో—ఇది కల్పనయే యగుగాక అయినను—ఆజాతికి నారియందుండెడి శ్రద్ధతో సమమగు శ్రద్ధ మరెచ్చటను లేదు. పాశ్చాత్య

* వివేకానందుడు ప్రతివిషయమును తన ఆదర్శములో సరిజూచుచు విచారించెడువాడు. ప్రాచ్యపాశ్చాత్యవివాహపద్ధతులు రెండును జగత్కల్యాణమున కవసరములేయని ఆయన తలపు. మెండట పాశ్చాత్యసభ్యతనుగాంచి ఆకృష్టుడైనను, పిదపదాని ధనలిప్స శ్రమలను గుర్తించినాడు.

—నివేదిత

వారి భుజములమీదనున్న శాసనములభారము ఈ దేశపు స్త్రీ లెరుంగరు. మనసంఘమున దోషములు, అన్యాయములు ఉన్నవి వారి సంఘమునగూడనున్నవి. ప్రేమ దయాదాక్షిణ్యాదిగుణములను ఆయాజాతులు ఆచారములద్వారా వెల్లడింప ప్రయత్నించినారను విషయమును మరువరాదు. భారతదేశమందలి గార్హస్థ్యధర్మ - ఆచారములకు ఇతరదేశాచారముల కంటె నధికమగు ఉపయోగమున్నదని నేను నిస్సందేహముగ చెప్పగలను.

పాశ్చాత్యవారి స్వతంత్రత. అదియే మెరుగు; వారు స్వయంవర మెంచుకొందురు, ఇదియే ఉత్తమ పద్ధతి;-సందేహమేమి! నాకు పాశ్చాత్యసంఘముతో ఒకింత ప్రత్యక్షపరిచయమున్నది; దీనచేసి, ప్రాచ్య పాశ్చాత్యసంఘముల కత్యంతభేదమున్నదని గ్రహించితిని; పాశ్చాత్యసంఘము ననుసరించి నిర్మింపబోవు సాంప్రదాయములన్నియు నిష్ఫలములగును. ఆదేశమున వసింపక ఆట స్త్రీపురుషుల మెలయికకును పాతివ్రత్యరక్షణార్థమునకును విధింపబడిన నియమములను కట్టుబాట్లను ఎఱుంగక ఈదేశమున స్త్రీపురుషులు విచ్చలవిడిగ తిరుగుట కొప్పుకొనువారియెడల నాకింతయు సానుభూతిలేదు.

నేను పురుషులకు జెప్పుదానినే స్త్రీలకును జెప్పెదను.

భారతదేశమున భారతీయధర్మమున శ్రద్ధావిశ్వాసములనుంచుడు. తేజస్వినులుగండు. ఆశతో నడుములు బిగింపుడు. భారతమున జన్మమని సిగ్గిలక గౌరవముగ భావింపుడు. ఇతరజాతులనుండి కొంచెము కొంచెముగ మనము గ్రహింపవలసిన విషయములున్నను, ఇతరజాతులకంటె వెయ్యిరెట్లెక్కువగ జగత్తున కీయవలసిన దున్నదని గుర్తునందుంచుకొనుడు.

(అను. పూర్ణానంద)

# రుద్రమాంబ

కొడాలి వేంకటరాజారావుగారు

[శ్రీ రుద్రమదేవి కాకతివంశ్యుడైన గణపతిదేవునికూతురు. ఈ కాకతివంశమునకు మూలపురుషుడు ప్రోలరాజు. రుద్రమ మహాయోధురాలు. పరిపాలనావిధానంకూడా బాగా తెలిసిన సమర్థురాలు. గణపతిదేవునకు కుమారులు లేకపోవుటచే, ఈమె ఓర్గల్లును రాజధానిగాచేసుకొని ఆంధ్రదేశము నేలుచున్నకాలంలో దేవగిరిరాజైన మహాదేవు డీమెపైకి దండెత్తిరాగా వానినిఓడించి తరిమేస్తుంది. అదే యీకథ.]

వనితలురాజ్యమేల మగవారికిలోకువ, అందుచేతనే
తినినది యొంటపట్టకిటు దేవగిరీశుఁడు దండయాత్రకై
పనిఁగొనివచ్చుచుంటినని పంపెనొకా నొక జాబువ్రాసి, మీ
రనికిదె సిద్ధమై బలములన్నియుఁ గూర్పుఁడహో! మహోద్ధతిన్.

అని తనవాహినీపతుల కాజ్ఞనొసంగిన రుద్రమాంబ, చ
య్యన సభనుండిలేచెను ముఖాంతరమందొక నూత్నశోభ తో
చినదట చూచువారలకు శీఘ్రమె అంతిపురంబులోనికిన్
చనెను ధరింపనామె పురుషభ్రమఁగొల్పు మహాద్భుతాకృతిన్.

కనబడు, ఆమహాద్భుతముఖమ్మున కాకతివంశచిహ్నముల్,
గణపతిదేవ భూపుని వికాస విచిత్రమహస్సులున్, మహా
రణమున శత్రురాజుల శిరస్సులఁద్రెబ్బెడి ధైర్యకీలలున్;
అణకువతోడకూడిన మహాచ్ఛ విశాలవిలోకనప్రభల్.

రథమునఁబూన్చినిల్పిరి తురంగములేడవి; భాస్కరాశ్వముల్
విధమునవోవు, అందున పవిత్రతకల్గిన రాచకాంత; వే
రథిఅయి, బైలుదేరెను పరాక్రమవహ్నిమరీచి మాలికా
నిధివిరఁజిమ్మ వీథులవినీతభటాళినిఁగూడి పోరుకై.

'ధమధమ' కొట్టినా రనిని ఢక్కలు, నోర్గలు మారుమ్రోయగా
'తమరికసిద్ధమే' అనువిధంబున కాకతిరాణిపత్రముల్
కుమతి, పరాయినేత; అనుకోనిప్రకారము దొంగత్రోవగా
సమరముఁజేరినాడు తనసైన్యముతో, విధివెక్కిరింపగన్.

అటునిటుదండనాయకులు నాశ్వికు లాపయికాలుబంటు లు
త్కటనిశితాసిధారులయి, కన్నులవెంబడి శోణితప్రభా

ఘటనవెలుంగ, యుద్ధమున కత్తులుకత్తులుకల్పినారు, వే
సటలుఁజనించె దేవపతిసంతతిలోపల నంతలోననే.

'ధణధణ' దుందుభిస్వన విధానము లాంధ్రపదాతియుద్ధనై
పుణులు, పునీతకాకతి సమున్నతరాజ్యమునిల్ప్పయుండు ధో
రణులు; ద్విషత్సమూహము విరామముఁగైకొన కాళ్లఁజూచుటల్
రణమునఁగానవచ్చెనట రాణి విజృంభణఁజేసిపోరగన్.

ఎఱుపునశించె దేవగిరి యేలికమోమున నాహవంబుపై
నెఱుపుహసించె; తాదృశనిరీక్షితులై హతశేషులైన ఆ
గిరిపతిజోదులంత పరుగెత్తిరికాళ్లబలమ్ముకొద్ది సం
గరమునువీడి జీవములఁ గాచుకొనంగనువీతవీర్యులై.

తురగముఁద్రిప్పిదేవగిరి త్రోవలఁబట్టినరాచవాడు, వే
పరుగులఁబోయినాడు, 'తనప్రాణముమాత్రము దక్కెనంచు,' సం
భరమునపొంగినాడు, నిజభావములో గ్రహియించినాడు; శ్రీ
కరనవశక్తిభారము, నికన్‌మరిరాడటు నొంటికాలుపై.

అరదమునెక్కి యోర్గలు పురావనిఁబోయెడి రాజమార్గమం
దరిగెడివీరసాధ్వి, నయనాంతరనిర్గమహర్షబాష్పదృ
క్కిరణవితానముల్ కురిసె గెల్చితిమన్న 'హుషారు'చేత 'జే!
పరహరిరుద్రమాంబ'కని పల్కుచువెళ్లిన సైనికాళిపై.

'ఆంధ్రజ్యోతి'నుండి.



# దయ్యాలకు కూడా దడేనా?

శ్రీమతి వడ్డాది సుశీలాదేవిగారు

శర్మగారు ఆనందభవనం కొనేటప్పుడు అంతా వద్దని చెప్పినారు. ఎంచేతనంటే ఆఇంట్లో దయ్యాలు ఉన్నాయని చాలవాడుక. కాని ఆయన చాలా దేశాలుతిరిగిన నవనాగరికుడు అవడంచేత లక్ష్యపెట్ట లేదు. మంచిరోజు చూడకుండానే ప్రవేశించాడు: అవును వేరేమంచిరోజాఎందుకూ? ఆయనరోజులుఅన్నీ మంచివే. దయ్యాలు లేవని ఆయనకు ఒక్కడికే కాదు నమ్మకం. ఆయనభార్య, బిడ్డలకికూడా అదేవిశ్వాసం. ఇల్లుఅంతా శుభ్రంచేయించి ప్రవేశించడంవల్ల వాళ్లకు ఏమీ చిరాకుకలగలేదు. ఇల్లుఅంతాపరిశుభ్రముగానే ఉన్నది. ఎంతజాగ్రత్తగా పనిచేయించినా పనివాళ్ల అశ్రద్ధలు అల్లాగేఉంటాయి. ఇంట్లోప్రవేశించిన మరునాడు హాలులో నేలమీద ఎర్రనిడాగుఒకటి ఎదురుగుండా కనుపిస్తే దాసీదానిచేత శుభ్రంగా కడిగించి తీయించివేశాడు. ఆరోజు మామూలుగానే జరిగిపోయింది. మరునాడు లేచి చూచేటప్పటికి ఆడాగు మళ్లీ అక్కడేఉంది. దాసీది సరిగా కడగ లేదేమోనని తను స్వయంగా కడిగిశుభ్రంచేశాడు. కాని ఆమరునాడు మళ్లీ డాగు అక్కడేఉంది. శర్మగారికి ఆయన భార్యకికూడా ఏమీతోచలేదు. ప్రతిరోజు ఆడాగు కడిగివెయ్యటము, ఆమరునాడు నిద్రలేచే టప్పటికి మళ్లీ అది తయారుకావటము జరుగుతూ ఉన్నది. దాసీదిమాత్రము "ఇందులో దయ్యాలు ఉన్నాయని నేను చెప్పలేదండీ, అమ్మగారూ," అని ఆతర్వాతరోజునుంచి పనిమానుకుంది. శర్మగారికి, ఆయన భార్యకుకూడా అనుమానముతట్టింది. ఇదివర కల్లా దయ్యాలులేవని వాదించేవాళ్లు ఇప్పుడు చటుక్కున అనడము మానివేశినారు: దయ్యాలు అనేవి ఉన్నాయని అనుమానంపట్టుకుంది. కాని భయపడలేదు.

ఒకరోజురాత్రి శర్మగారు నిద్రపోదామని పడుకున్నాడు. అప్పుడు రాత్రి 11 గంటలు అవుతుంది ఇంతే. వసారాలో ఏదో గొలుసుల చప్పుడులాగ ఆయనకు వినిపించింది. రెండునిమిషాలు ఆలోచించాడు. చప్పుడు తగ్గలేదు. పైగా అడుగుల చప్పుడు కూడా వినిపించింది. లాంతరు హెచ్చించి తలుపు తీసి చూశాడు. ఎదురుగుండా వెన్నెలలో స్పష్టముగా కనుపించింది దయ్యము. ఎర్రనికండ్లు, పొడుగాటిజుట్టు, చేతులనుంచి, కాళ్లనుంచీ వ్రేళ్లాడుతూ యినపగొలుసులూ. శర్మగారి గదికేసి నడుస్తూంది. శర్మగారుమాత్రం భయపడలేదు. "అయ్యా, ఆ గొలుసులు తుప్పపట్టినట్టు ఉన్నాయి. ఏనూనె అయినా ఎందుకు పొయ్యరు. చప్పుడు తగ్గేందుకు? ఇదిగో, ఈ కొబ్బరినూనె శీసా పట్టుకువెళ్లి ఆ గొలుసులమీద పొయ్యండి" అని ధైర్యంగాఅని నూనె సీసా ఒకటి అక్కడపెట్టి తలుపువేసుకున్నాడు శర్మగారు. దయ్యానికి ఒక నిమిషంసేపు ఏమీ తోచలేదు. తరువాత అతికోపంతో సీసాని నేలనివేసి కొట్టి వసారాలో పరుగెత్తడం మొదలుపెట్టింది. ఈ చప్పుడువిని శర్మగారి రెండవకొడుకుకి మెలకువ వచ్చి దయ్యాన్నిచూచి దానిమీదకు దగ్గరఉన్న తలగడా గట్టిగా విసిరేడు. శర్మగారి కొడుకేగా మరీ. బుద్ధులు ఎక్కటికి పోతాయి? ఆరోజున లేచినవేళ మంచిది కాదనుకొని దయ్యం దూరంగా పోయింది.

మర్నాడు ఉదయం. తాను ఇచ్చిన కొబ్బరినూనె సీసాని నిర్లక్ష్యంగా విసిరివేసినందుకు శర్మగారికి దయ్యముమీద కొంచెము కోపంగానే ఉన్నది. ఆ తర్వాత వారంరోజులదాకా దయ్యం అల్లరి మాని వేసింది. నేలమీద ఆ ఎర్రటిడాగు విడవకుండా

కనుపించేటట్టు చెయ్యడంతప్ప ఇంకేమీ చేయడం లేదు. శర్మగారి కుటుంబాన్ని హడలగొట్టలేక పోయాము గదా అని దానికి విచారంగానే ఉన్నది. మళ్లీ ఒకరోజున బయలుదేరింది శర్మగారి కుటుంబం మీద కసితీర్చుకునేందుకు. ఈమాదిరిగా ప్లాను వేసుకుంది. మొట్టమొదట శర్మగారి కొడుకుగదికి వెళ్లి అతని గుండెలమీద ఎక్కికూర్చోటము. తరువాత భార్యాభర్తలు పడుకున్న గదికి వెళ్లి ఇద్దర్నీ చెరొక చేతిలోనూ పట్టుకుని గొంతుక పిసకటము. ఇది నిశ్చయముగా చెయ్యాలి అనుకుంది. శర్మగారి ఎనిమిదేండ్లకూతురు కమలనిమాత్రము ఏమిచేయ దలచుకో లేదు. ఆపిల్ల ఇంతవరకూ దయ్యానికి ఏమీ కోపం తెప్పించలేదు. అంతా నిద్రపోయినతరువాత శర్మగారి కొడుకుగదికి బయలుదేరింది. అతను ఇంకా నిద్రపోలేదు. తలుపుతీసేఉంది. దయ్యము తలుపుతొయ్యగానే చూచి దగ్గరఉన్న కూజామీదకు విసిరాడు. ఇల్లా జరుగుతుందని దయ్యము ఎన్నడూ అనుకోలేదు. దయ్యానికి శరీరంలేదని ఊరికే మనవాళ్లు ఏదోఅంటారు కాని శరీరంలేకపోతే మనకు ఎల్లా కనుపించుతుందేమిటి. అందుచేత శరీరంఅనేది దానికీ ఉన్నదన్నమాటే. తలవని తలంపుగా కూజా వచ్చి మీదపడటంతోటే దయ్యము కాళ్లకి బుద్ధి చెప్పింది, మిగతా ప్రోగ్రాము మానేనుకుని. దయ్యాలకి ఇల్లాంటి పరాభవం ఎన్నడూ జరిగినట్టు ఇంత వరకు ఎక్కడా వినలేదు అందుచేత దానికి మరింత విచారంగాఉంది.

శర్మగారి కూతురు కమల మర్నాడు సాయంత్రము చీకటిపడినతర్వాత యింటిచుట్టూఉన్న తోటలో ఆడుకుంటూఉంటే ఒకమూల దయ్యము విచారంగాకూర్చుని కనుపించింది. దయ్యాన్ని చూడగానే కమల పారిపోయింది. కాని అది అతివిచారముగా కూర్చోటంచూచి భయంతగ్గి దయ్యాన్ని సమీపించి "ఎందుకు ఏడుస్తున్నావు? నువ్వు ఇంట్లో ఏమీ అల్లరిచేయకుండాఉంటే మావాళ్లు ఏమీ చెయ్యరు నిన్ను" అన్నది. అప్పుడు దయ్యము "ఏమిటీ, అల్లరిచేయకూడదూ? మనుష్యుల్ని భయపెట్టకూడదు? జనాన్ని కష్టపెట్టేందుకు కాకపోతే నేను ఎందుకు ఉండటము?"

"ఇల్లా ఎన్నాళ్లుఉంటావు నువ్వు, అందరినీ ఏడిపిస్తూనూ?"

"ఇప్పటికి 300 ఏళ్లనుంచి ఉన్నాను. ఇంకా ఎంతకాలం ఉండాలో నాకే తెలియదు. ఇదివరకు నేను బ్రతికిఉన్నప్పుడు చేసిన పాపాలికి ఫలితంగా ఇల్లా దయ్యంగాఉన్నాను."

"పాపాలకి ఫలితంగా దయ్యంఅయితే ఇప్పుడు నువ్వు చేస్తూఉన్న పనులుమాత్రం పాపాలుకావూ? జనులని భయపెట్టడం, ఏడిపించటం, కష్టపెట్టడం మాత్రం పాపంకాదూ? దయ్యంఅయికూడా మరి పాపంచేస్తే నీకు ముక్తి ఏంకలుగుతుంది. ఇప్పుడు నువ్వుచేసే పుణ్యంఏమిటి?"

"ఏమో వాటికి జవాబు నేను చెప్పలేను. నువ్వు అమాయకపుపిల్లవు. గనక, నువ్వు నన్నుగురించి దైవాన్ని ప్రార్థించితేమాత్రం నా కీ దయ్యపుజన్మ పోతుంది. జనానికి ఏమీ బాధఉండదు. నీప్రార్థన దేవుడు తప్పకుండా వింటాడు."

"ఎవరికైనా సహాయంచెయ్యటం నాకు ఇష్టమే. నిన్నుచూస్తే నాకు జాలివేస్తోంది. ఈవేళ రాత్రి తెల్లవార్లూ నీకోసం ప్రార్థిస్తాను" అని కమల చెప్పి వెళ్లింది.

అనినమాట తప్పకుండా కమలా ఆరాత్రంతా దైవాన్ని వేడుకుంటూ కూర్చుంది.

ఆతర్వాత ఎన్నడూ దయ్యం ఎవరికీ కనుపించలేదు.

# తల్లి దండ్రులు—బిడ్డలు

శ్రీమతి పరసా సీతారామమ్మగారు

జననీజనకుల యాహ్లాదములు నిగూఢంబులు. వారి విచారములును భయములును నట్టివియే. వారు తమ సంతోషముల నితరులకు దెలుపలేరు. విచారభయములను దెలుపరు. బిడ్డలుండువారికి కాయకష్టముల వలని కష్టములెఱుకపడవు. కాని దురదృష్టముపైకొన్నచో దానివలని బాధలు బిడ్డలుండుటవలనే మఱింతయెక్కువగుచున్నవి. బిడ్డలు జీవితకాలకష్టములను వృద్ధిపఱతురు కాని మరణచింతను తగ్గింతురు. వంశాభివృద్ధి మృగములయందును గానబడుచున్నది. కాని మరణచింత, సుగుణము ఘనకార్యాచరణము ననునవి మనుష్యలక్షణములు. సత్రనిర్మాణాది ఘనకార్యములు ప్రాయశః సంతానవిహీనులవలననే చేయబడుచున్నవి. ఇట్టి సంతానవిరహితుల మనస్సునందలి ప్రతిబింబములను వారి శరీర ప్రతిబింబములు స్పష్టపరచుట యొదవమిచే వారుచేయు ఘనకార్యములు తెలుపుచున్నవి. కనుక దమకు తరువాతి వారి విషయమయిన చింత చాలవరకు తమకు దరువాతివారు లేనివారికుండును. తమవంశమున మొదటి వంశోద్ధారకులయిన వారు తమసంతానమును వంశాభివృద్ధి హేతువగు సంతానమనిమాత్రమేగాక వంశోద్ధారణమునకయి తాముచేసిన ఘనకార్యముల యభివృద్ధి హేతువని కూడా యెంచుకొని మిక్కిలి గారాబముతో జూచుకొందురు.

తల్లిదండ్రులు తమబిడ్డల యందఱియెడల ననేక విషయములయందు సమానప్రేమ నగపఱుపరు. ఈపక్షపాతము కొన్నిసమయములయందు జూచువార లసహ్యపడునంతటిదిగ నుండును. ముఖ్యముగ దల్లియందు పక్షపాతము కానవచ్చెడిది. సాలొమను (Salomon) చెప్పినట్లు సుపుత్రుడు సంతోషపెట్టును. కుపుత్రుడు తల్లికి కవమతియైనర్చును. పెక్కురుబిడ్డలున్న కుటుంబమున మొదటి యొకరిద్దఱును గట్టిశిక్షచే బెరుగుదురు. కడబటివారు గారాబమున బెరుగుదురు. అయిన నింతమాత్రము లక్ష్యపెట్టబడని నడుమవారే యందఱిలో నుత్తములగుట తటస్థించును. తల్లిదండ్రులు యుక్తాయుక్తములనరయక గారాబముకొలది దమ బిడ్డల కడిగినవన్నియు నిచ్చుచుంట యపాయకరమయినతప్పు. అట్లిచ్చుచున్నచో వారు నీచవృత్తులయందు బ్రవేశింతురు. జిత్తులమాఱులగుదురు. దుస్సాంగత్యమలవఱచుకొందురు. భోజనప్రియులగుదురు. కనుక బిడ్డలను గట్టిశిక్షయందుంచి వారికి భక్తివిశ్వాసములు కలుగజేయవలయును గాని వారడిగినదంతయు నిచ్చిగాదు. కొందఱు బాల్యమున నన్నదమ్ములకు పరస్పర తరతమభావములు బుట్టింతురు. ఇయ్యది దుశ్చేష్ట. ఈతరతమత్వము వారు వయోవంతులయినపుడు ప్రబలవిరోధముగా బరిణమించి కుటుంబముల నాశనము గావించును.

ఇటలీదేశస్థులకు దమబిడ్డలు, దమయన్న దమ్ములబిడ్డలు, దాపుచుట్టము లను వివక్ష లేదు. స్వసంతతిగాకున్నను నేకకుటుంబము వారయినయెడల జాలును. ప్రేమాతిశయము గనబడుతురు. ప్రకృతియందు నిర్లేయగ పడుచున్నది. సాధారణముగా నొకనియందు రక్త స్పర్శానుసారముగ నాతనితండ్రి పోలిక కంటె నెక్కుడుగ బినతండ్రి పోలికయైనను సన్నిహితబంధువు పోలికయైనను కానబడు చున్నది. తల్లిదండ్రులు దమబిడ్డ లవలింబింప వలసిన వృత్తులను, ననుసరింపవలసిన మార్గములను, యుక్తసమయముననే నిర్ధారణ సేయవలసినది. అట్లర్హ సమయమున నిర్ణయించినచో దన్నిర్ణయము సులభసాధ్యమగును. తమబిడ్డలను మిక్కిలి యిష్టమైన విషయమును నిర్ణయించుటలో దామెక్కువ నైపుణ్యమునగువఱుపగలమని నెంచుకొని తలిదండ్రులు తమబిడ్డల చిత్తవృత్తులయం దతివిస్తారమైన సంబంధము కలుగజేసికొనగూడదు. బాలుడు తన కేదయిన నొకమంచివిషయమున నభిరుచి కలిగిన యెడల నా విషయమునుగూర్చి శంకించి నిరుత్సాహులు కాగూడదు. ఉత్తమ విషయముల నేర్చుకొనవలయును. తదాచరణము తొలుదొలుత గష్టముగ నగపడినను నలవాటున నయ్యది మనోహరమైనదియు సులభమైనదియునగును. ముందువారి జీవనాధారమునకు వారే పాటుపడుదురుగాక యని తల్లిదండ్రులు బాల్యముననిడిన గట్టి శిక్షచే బెఱిగినవారగుట వారు గుణవంతులు నదృష్టవంతులు నగుదురు. కాని యేకారణముచేనయినను వారు తమ జ్యేష్టులకు దక్కవలసిన యాస్తి తమకు దక్కినయెడల నట్లు హఠాత్తుగ దక్కిన యాస్తివలన గర్వముచే జెడిపోదురు.

---

## ప్రబోధము

శ్రీమతి పి. కమలాదేవిగారు

మేలుకొనుమో మాతృభక్తుడ
మేలుకొనుమో దేశభక్తుడ
మేలుకొనిమా మాతృభూమిని
ఏలుకొనవయ్యా—
పూర్వముమన మాతృభూమి
పుణ్యవంతంబై నదయ్యా
దానికిప్పుడు పాపపఙ్కము
బూయకండయ్యా—
పూర్వమూ యీదేశముననే
గొప్పకవులూ పుట్టిరయ్యా

అట్టిదేశము పట్టుబోయెను
కవులులేరయ్యా—
భారతీయుల భూరిశౌర్యము
ధారుణిం గడు బ్రసిద్ధము
అట్టిపీరుల గన్నదేశము
గొడ్డుపోయిందీ—
మాతృభాషా సేవయందే
మనమునిల్పిన భ్రాతలెందరో
పూర్వమిచ్చట కలరుగానీ
ఇప్పుడేరయ్యా—

"సరేలే, మా శాంబిగాడు సన్నాయూత్తాడు. మా బుల్లిచెల్లి పెద్దచెల్లి బాజాలు వాయిస్తారు. నేను సామానంతా తీసుకొస్తాను. మీరు ముందు నడవండి."

"గొడవచెయ్యకండ్రా మా మామయ్య చూస్తే చదువుకోలేదని తిడతాడు. ఏమే చిట్టీ, మీనాన్నెక్కడున్నాడు?"

"భయం లేదురా, నిద్దరోతున్నాడు."

"లేస్తే తిడతాడు. మాట్టాడకుండా వరండాలోకి పోదాం."

"మీ రిద్దరూ యిల్లా పీటమీద కూర్చోండి. కాళ్ళకి పసుపురాసి పారాణెడతాను.

"ఉత్తుత్తి పారాణేనామరి? నిజంగా ఐతేనే రాయించుకోను."

"అబ్బే. ఉత్తిదేరా."

"నువ్వీ పుస్తెలు పెళ్లికూతురుమెళ్లో కట్టు. బాజాలు వాయించండ్రా."

"తలంబ్రాలో మరి?"

"మా అమ్మనడిగి బియ్యం పట్రానా?"

"వద్దుబాబూ తిడుతుంది. ఉత్తుత్తివి పోసుకుందాం."

"పోనీ, అటుకులెట్టిపోసుకోండ్రా. తరవాత అవన్నీ తినేసి ఊరేగుదాం."

"అల్లా చేద్దామే చిట్టీ."

"అబ్బా! చూడవో కాంతం, తలంబ్రాలోస్తూ నెత్తిమీద మొట్టుతున్నాడు."

"తిన్నగా పొయ్యరా సుందరం. నువ్వు మళ్లీ మొట్టవే."

"మావయ్యొస్తున్నాడే చిట్టీ."

"అదేమిట్రా. అటుకులల్లా పారపోసుకుంటున్నారు?"

"ఏమీలేదు నాన్నా, ఆడుకుంటున్నాం."

"ఆ నెత్తినిండా అటుకులేమిటి? తలంబ్రాలేమిటి?"

"మీ చిట్టికి సుందరానికి పెళ్లండి."

"అప్పుడే పుస్తెకట్టేసేవేమిట్రా."

"..............."

"మేం ఆడుకుంటూవుంటే మధ్య నువ్వేమిటి నాన్నా?"

"ఏం ఆడుతున్నావు."

"మీ సుందరాన్ని పెళ్లాడుతోందండి."

## 3

"మా మేష్టారు వుత్తరంరాయడం నేర్చుకో మన్నారు నాన్నా."

"ఇప్పుడు రాస్తున్నదదేనా?"

"ఔను నాన్నా, ఇంకా పూర్తిఅవలేదు."

"ఎవరికి రాస్తున్నావు?"

"బావకి."

"ఏదీ చదువు."

"ఏమిరా సుందరం! నువ్వు మెడ్రాసెళ్లి అప్పుడే నాలుగు నెల్లైందికదా........."

"అదేమిటే నీ తలకాయి?"

"మీవాళ్లు కనిపిస్తే మీ కేం చెప్పదలచుకున్నారో అదేవుత్తరంలో రాయమని మా మేష్టారు చెప్పేరు నాన్నా."

"అందుకని అల్లా రాసేవా?"

"ముందు రాసిందంతా విందూ."

"...నాలుగు నెల్లైందికదా? ఇప్పటికి ఒక్కమాటేనా రాలేదుకదా! నాకు బెంగగావుందట్రా! పోనీ వుత్తరం రాసీనాకాని, నాన్న పేరెట్టి యింగ్లీ

"సరేలే, మా బావిగాడు సన్నాయూత్తాడు. మా బుల్లిచెల్లీ పెద్దచెల్లీ బాజాలు వాయిస్తారు. నేను సామానంతా తీసుకొస్తాను. మీరు ముందు నడవండి."

"గొడవచెయ్యకండ్రా మా మావయ్య చూస్తే చదువుకోలేదని తిడతాడు. ఏమే చిట్టీ, మీనాన్నెక్కడున్నాడు?"

"భయం లేదురా, నిద్రోతున్నాడు."

"లేస్తే తిడతాడు. మాట్లాడకుండా వరండాలోకి పోదాం."

"మీ రిద్దరూ యిల్లా పీటమీద కూర్చోండి. కాళ్లకి పసుపురాసి పారాణెడతాను.

"ఉత్తుత్తి పారాణేనామరి? నిజంగా ఐతేనే రాయించుకోను."

"అబ్బే. ఉత్తిదేరా."

"నువ్వీ పుస్తెలు పెళ్లికూతురు మెళ్లో కట్టు. బాజాలు వాయించండ్రా."

"తరంబ్రాలో మరి?"

"మా అమ్మనడిగి బియ్యం పట్రానా?"

"ఒద్దుబాబూ తిడుతుంది. ఉత్తుత్తివి పోసుకుందాం."

"పోనీ, అటుకులెట్టిపోసుకోండ్రా. తరవాత అవన్నీ తినేసి ఊరేగుదాం."

"అల్లా చేద్దామే చిట్టీ."

"అబ్బా! మాధవో కాంతం, తరంబ్రాలోస్తా నెత్తిమీద పోట్టుతున్నాడు."

"తిన్నగా పొయ్యిరా సుందరం. నువ్వు మళ్లీ పోట్టకే."

"మావయ్యొస్తున్నాడే చిట్టీ."

"అదేమిట్రా. అటుకులల్లా పారపోసుకుంటున్నారు?"

"ఏమీలేదు నాన్నా, ఆడుకుంటున్నాం."

"ఆ నెత్తినిండా అటుకులేమిటి? తరంబ్రాలేమిటి?"

"మా చిట్టికి సుందరానికి పెళ్లండి."

"అప్పుడే పుస్తెకట్టేసేవేమిట్రా."

"..................."

"మేం ఆడుకుంటూవుంటే మధ్య నువ్వేమిటి నాన్నా?"

"ఏం ఆడుతున్నావు."

"మీ సుందరాన్ని పెళ్లాడుతోందండి."

3

"మా మేష్టారు వుత్తరంరాయడం నేర్చుకోమన్నారు నాన్నా."

"ఇప్పుడు రాస్తున్నదదేనా?"

"ఔను నాన్నా, ఇంకా పూర్తిఅవలేదు."

"ఎవరికి రాస్తున్నావు?"

"బావకి."

"ఏదీ చదువు."

"ఏమిరా సుందరం! నువ్వు మద్రాసెళ్లి అప్పుడే నాలుగు నెల్లెందికదా........."

"అదేమిటే నీ తలకాయి?"

"మీవాళ్లు కనిపిస్తే మీరేం చెప్పదలచుకున్నారో అదేవుత్తరంలో రాయమని మా మేష్టారు చెప్పేరు నాన్నా."

"అందుకని అల్లా రాశేవా?"

"ముందు రాసిందంతా విందూ."

"...నాలుగు నెల్లెందికదా? ఇప్పటికి ఒక్కమాటేనా రాలేదుకదా! నాకు బెంగగావుందట్రా! పోనీ వుత్తరం రాసినాకాని, నాన్న పేరెట్టి యింగ్లీ

షుని కాని రాయకపైను. అందులో యేముందో నాకు తెలియదు. నాన్న నడుగుతే యేమీ చెప్పడు. మరి నా కెల్లావుంటుంది? నీకేం. మీ జతకాళ్లతో ఆడు కుంటూ కూచుంటావు. ఇక్కడనే నొక్కత్తిని యెంత బెంగెట్టుకున్నానో నీకేం తెలుసును?........."

"ఏడుస్తా వెందుకే?"

"అవున్నా నాన్న, ఒక్కమాటేనా రాడు మరి."

"పండుక్కరమ్మని వుత్తరం రాస్తానులే. బెంగెట్టుకోడ మెందుకు, బావ మహారాజులా ఓవరు సీలు పరీక్ష చదువుతుంటేను?"

"మరి నాక్కూడా యింగ్లీషు చెప్పించు నాన్నా."

"ఎందుకు? బావ వుత్తరంరాస్తే చదువుకోడానికా?"

"అసలు నేకూడా యింగ్లీషు చదువుకుంటాను నాన్నా."

"అల్లాగే. ఎల్లుండి మంచిది, యింగ్లీషుబళ్లోకి వెడుదువుగాని. ఇక యీ ఖరిమా నేసెయ్యి."

"ఐతే! యిక వుత్తరం రాయను."

"రాయక్కరలేదు. అన్నానికి పొద్దుపోతోంది లే."

౪

"గుడ్ మార్నింగ్ సుందరం. వెన్ డిడ్యు కం?"

"అబ్బో యీ యింగ్లీ షెక్కడొచ్చింది?"

"ఎల్లకాలం తెలుగేనేమిటి?"

"ఎవరు చెపుతున్నారు?"

"ఇంగ్లీషుబళ్లోనే?"

"ఐతే యిప్పు డెన్నో క్లాసన్నమాట?"

"ఐతే యిప్పుడు ఫస్టుఫారమన్నమాట."

"మరి నాయింజనీరింగుకోర్సు పూర్తయేసరికి తమకి తరడుఫారమ్ పూర్తవుతుందన్నమాట."

"అవునన్నమాట."

"అప్పుడే యెంతగర్వమొచ్చింది."

"గర్వంకనక నే వుత్తరంరాయకపోవడం."

"ఉత్తరంరాయకపోడం గర్వమా? వుత్తరం వొచ్చిందోలేదో చూసుకోపోవడం గర్వమా?"

"ఎల్లాగైతేం యింగ్లీషొచ్చునుకదాఅని యింగ్లీషుని రాయడం గర్వం."

"నాకూ యింగ్లీషొచ్చును సుమాఅనిచెప్పడం గర్వం కాదూ?"

"పోనీ యీమాటేనా వెళ్లగానే వుత్తరం రాస్తావా?"

"వెళ్లగానే వుత్తరంయెందుకూ? యిరవైరోజుల్లోనే నేనొస్తాను."

"మళ్లీవొస్తావా?"

"ఎందుకూ?"

"ఎందుకా? నీమెళ్లో..."

"........."

"నీమెళ్లో పుస్తికట్టడానికి."

"నిజమేట్రా?"

"ఏం. నీకు తెలియదేమిటి?"

"మరి ఒవరుసీలుపరీక్ష అయ్యీదాకా పెళ్లిచేసుకో నన్నావుకాదూ?"

"పెళ్లిచేసుకోనన్లేదు, కార్యంచేసుకోనన్నాను."

"ఛీ, అన్నీ యిల్లాంటిమాటలే, అందుకే మొట్టబుద్ధి."

"రేపు తలంబ్రాలోసేటప్పుడు మొట్టుతానులే."

"అబ్బాయీ అన్నానికిలే మామయ్య కనిపెట్టుకున్నాడు."

౫

"ఏమండీ అత్తగారూ, మీ అమ్మాయేదీ?"

"రా కాంతం యిల్లా కూచో. ఎప్పుడొచ్చేవు?"

"పొద్దున్న ఏడుగంటల రైలులో వొచ్చేమండి."

"మీ ఆయనకూడా వొచ్చాడా?"

"వొచ్చారు. పండుగ కాదుమరి?"

"ఏంచేస్తున్నాడు?"

"డాక్టరుపరీక్ష ప్యాసయారు. ఏలూర్లో ప్రాక్టీసు చేస్తున్నారు. మీ సుందరం యెక్కడుంటున్నాడండీ?"

"వాళ్ల మామగారూ వోవరుసీలుపని యిప్పించేరు. ఇక్కడే వుంటున్నాడు."

"ఓవరుసీలుగారి పెళ్లాం కదా అనేమిటండీ యింటికొచ్చినా కనపడ్డం లేదు?"

"మొగుడికి కాఫీ కాస్తోన్నట్టుంది. చిట్టీ! మేష్టారి కాంతం వొచ్చిందే."

"మరిచిపోయాను మనమడికి పేరేం పెట్టేరండీ అత్తగారూ?"

"వాడే, వాళ్ల నాన్న పేరెట్టేడు."

"శంకరంగారా?"

"ఏమోనమ్మా బుద్ధితక్క శంకరయ్యా పోయాను."

"ఎప్పుడొచ్చేవే కాంతం?"

"ఓవరుసీలుగారి పెళ్లానివి. తిక్క శంకరయ్యగారి తల్లివి. నీకు మేం కనిపిస్తామా?"

"కనపడకపోతే మీ ఆయనచేత కళ్లు ఆపరేషన్ చేయించుకో—"

"మధ్యన నాకళ్లెందుకూ?"

"డాక్టరుగారి పెళ్లానివికనక. పోనీలే. కాస్త టీపుచ్చుకుందుగాని రా."

"ఆ కాస్తకోసం నేను లేవడమెందుకూ? ఇల్లాగే తెచ్చిపెట్టు."

"లోపలైతే అంతా కూచోవచ్చును కదా అని."

"అంతా యెవరు? సుందరం వున్నాడేమిటి?"

"ఊఁ."

"అతన్నికూడా యిల్లాగే రమ్మందూ."

"మేష్టారి కాంతం వొచ్చిందిరా సుందరం."

"కొడుకు తల్లివికూడాను. ఇంకా ఒరేఅనే పిలుస్తావేమిటే చిత్రం."

"లేకపోతే యీ వేళ కొత్తగా పిలుస్తానేమిటి?"

"ఓవరుసీలుపనికూడా అయిందైను."

"ఐతే పూడిపడ్డాడా?"

"మీకేశా నాలుగు దివాట్లెట్టరేం అత్తగారూ?"

"పోనిద్దూ, యెల్లాపిలుస్తేనేమిటి? మేనత్తకొడుకు మేకల్లో కుక్క అన్నారు."

# శాసన సభలు – స్త్రీల కర్తవ్యము

శ్రీమతి క్రొవ్విడి మాణిక్యాంబగారు

[నూతనసంస్కరణముల ప్రకారము శాసనసభలకు కొంతమంది మహిళామణులు ఎన్నుకొనబడియున్నారు. ఇంకను కొంతమంది ప్రభుత్వమువారిచే నియమింపబడవచ్చును. ఏ ఇతర విషయములతో బాటు తమ సంఘమునకై ముఖ్యముగ చేయవలసిన కృషి యెంతేనియుగలదు. వారు స్త్రీలవిషయమై యేయేమి కృషిచేయవలసియున్నదో; యేసమస్యల నెటుల నెదుర్కొనవలసియున్నదో తమ యభిప్రాయములిచ్చుచు, పాఠకసోదరీమణులందరు క్లుప్తముగ వ్రాసి యేప్రెల్ 15వ తేది లోపల పంపినచో ప్రకటింపగలము. సంపాదకుడు.]

శాసనసభల ఎన్నికల సంరంభమును ప్రజలెల్ల వీక్షించియేయుండిరి. పల్లెలలో నున్న పాటకపుజనులకు సైతము ఆబాలగోపాలమునకు ఎన్నికావిషయములు బోధపడినవి. వేర్వేరుపక్షములు పత్రికలద్వారా గ్రామసభలద్వారా, కరపత్రములు ఊరేగింపులుద్వారా తమ యాశయముల వెల్లడించుటయేగాక ప్రత్యర్థులయెడగల వైషమ్యనిరసనభావములగూడ బ్రకటించిరి. ఇట్టి యేర్పాట్లచే ప్రజలలో నైకమత్యమునకు బదులు వైషమ్యము, చీలికలు, మనస్పర్థలు, క్రోధావేశములు గలిగి హిందువులు ప్రజాపరిపాలనావిధానమున కర్హులగుటకింకను కొంతకాలము పోవలయునేమో యనిపించినది. గృహచ్ఛిద్రములు బయల్పడుచున్నవి. దేశముక్తి, మానవస్వాతంత్ర్యములకొరకు కంకణము గట్టుకొని బహుకష్టములపాలై చిరకాలమునుండి పనిచేయుచున్నది కాంగ్రెసు సంస్థయొక్కటే యని తెలిసికొనియు తమ యుద్యోగాశయములనైననేమి స్నేహప్రోద్బలమునైననేమి పురుషులు పలుద్రోవలద్రొక్కినను స్త్రీరత్నములు మాత్రమట్టిహీనతకులోను గాక దేశోద్ధరణకు కాంగ్రెసేశరణ్యంబని గ్రహించి తమ పవిత్రవోటును కాంగ్రెసుకే యిచ్చి విధికృత్యము నెరవేర్చుకొనిరి. వారెంతయు సంస్తవనీయులు. తత్ఫలితముగనే కాంగ్రెసువిజయమును గాంచినారము.

ఈ శాసనసభలలో స్త్రీసభ్యురాండ్రు గూడగలరు. వారుతమ కర్తవ్యముల మరువకుందురుగాత! భగవంతుడు తమకు ప్రజాసేవకై గలిగించిన యవకాశముల వ్యర్థబుచ్చకుందురుగాక! సభలో తమ యభిప్రాయముల వెల్లడించ సాహసములేక తమ పార్టీవారితో ‘కంక’రైతిమని చెప్పుచుండు కొంతమంది పురుషపుంగవులవలెగాక, స్త్రీలు తమ యాశయముల వెల్లడించి ముఖ్యముగా స్త్రీయభ్యుదయమునకే పాటుబడ ప్రార్థితులు. శ్రీమతి ముత్తులక్ష్మమ్మగారు మొదలగు మహిళామణులు శాసనసభల ప్రవేశించి సంఘమునకు గావించిన సంస్కరణముల తిలకించియేయున్నారు. అట్లే వీరుగూడ సంఘసంస్కరణలకు పాటుబడవలెను. ప్రస్తుతము స్త్రీలున్న యధోగతి దైన్యస్థితుల

నెంచి వారినుద్ధరించ సమకట్టవలెను. స్త్రీలను విద్యాప్రవీణులజేయు నేర్పాటులెందును గానరావు. రాష్ట్రమునందు బాలికలకు ప్రత్యేక ఉన్నతపాఠశాలలరుదు. ప్రతి తాలూకాకును అధమపక్షమొక యున్నత పాఠశాలయైన నుండవలెను. వీటియందు పారిశ్రామికవిద్య గరుపబడవలెను. పరిశ్రమలపైననే దేశౌన్నత్య మాధారపడి యున్నది. హిందూసంఘమునందుగల గొప్పలోటు అతిబాల్యవివాహము. శారదా చట్టముసైతము విరివిగా నమలునందుండక పోవుటచే దాని నిర్మూలించలేకున్నది. ప్రతి గ్రామమునందును స్త్రీవిద్యాప్రచారము సలిపి, స్త్రీసంఘముల నేర్పరచి, స్త్రీల ప్రత్యేకగ్రంథాలయముల నెలకొల్పి, అందను దినము వార్తాపత్రికల జదివిచెప్పుచు, ప్రస్తుత పరిపాలనాపద్ధతులను, సంఘలోపములను, ప్రపంచపరిస్థితులను బోధించుచు, ఇతర దేశములందు స్త్రీలు పురుషులకుమించి ఎట్టి ఘనకార్యముల జేయగల్గుచున్నారో జెప్పి, స్త్రీలకు పురుషులతో సమానహక్కుల రాబట్టి యభివృద్ధికిదెచ్చు యేర్పాట్లు గావింపవలెను. కేవలము ధనాశాపరవశులై, లేబ్రాయంపుబాలికలను కాటికి కాలుజాపుకొనిన ముదుసలులకు వివాహము జేసి దేశమున బాలవితంతువుల సంఖ్య వృద్ధిజేయుచున్న తలిదండ్రుల దురాచారముల మాన్ప ప్రభుత్వ చట్టనిర్మాణముల గావించవలెను. ఇట్టి సౌకర్యములకై స్త్రీ సభ్యురాండ్రు పాటుబడి, ఇతరులు పాటుబడునట్లు చేసి, స్త్రీయౌన్నత్యముమీదనే దేశౌన్నత్య మాధారపడియున్నదని వెల్లడి చేయుట స్త్రీలకర్తవ్యము.

---

## సుపుత్రికా జననము

శ్రీమతి సామవేదుల చిరంజీవమ్మగారు

ఆదివేల్పుఖల విద్యాప్రౌఢిగాంచుట తనకుమారిక ప్రసాదమునగాదె
వలిమలరేడు సర్వజ్ఞుతో వియ్యంబు గాంచుట చిన్నారిగాంచికాదె
కలశాబ్ధిరారాజు కంజాక్షునిల్లట వల్లుగాజేసెనెవ్వతెకతాన
పుత్రసంతతిలేక బొగిలెడిపితరుల దౌహిత్రులంగాంచి తనిపెనెవతె

అట్టి సుకుమారిగాంచు భాగ్యంబుకంటె
మించుసంపదలేమి కామింపగలము!
పుత్రుకంటెను కడుహెచ్చు పుత్రియొకద
పుణ్యమాతృత్వమామెను పొందుగాన!

శ్రీరామచంద్రుని శూరసంపత్తియు సీతామహాదేవి శీలగరిమ
సత్యహరిశ్చంద్రు సత్యవాక్పాలన *తారామతీ భర్తృదాస్యమహిమ

* తారామతి: చంద్రమతి.

# సుపుత్రికాజననము

సత్యవంతుని పితృసంసేవనంబును సావిత్రి పతిభక్తి శక్తియుక్తి,
పాండవపంచక బలవీర్యధీరత ద్రౌపది కార్యసాధన ప్రసక్తి,
వెలసెనొక్కటికొక్కటి వీగిపోక
ఆమహాసాధ్వులోకయింటి యాడుబిడ్డ
లే కదా! వారిగాంచియు నీవిధాన
ఆడుపుట్టువులన నింతహాస్యమేల!
శాస్త్రవిజ్ఞానంబు చవిచూప నెంచిన తీరమాటుదురు మైత్రేయి పోల్కి
రాజ్యభారముబూని ప్రజలబ్రోచుడటన్న ప్రతిభనేలుదురు దుర్గావతివలె
కత్తిచేతికినిచ్చి కదనరంగముజూప ఝాన్సీమహాలక్ష్మి ఛాయదిగుదు
రాత్మదేశోద్ధారణార్థంబు పిలచిన అంజవైతురు రుక్మిణమ్మమాడ్కి
కలముచేబూన్ప నవకావ్యకల్పనముల
మొల్లరీతులజూపుదు రెల్లరలర
నిజయశోమానరక్షణా నిపుణులగుచు
వెలమకులకాంతలట్టుల నిలుపగలరు
పడతులెంతకుతగరు చెప్పవలెగాని!
కలిమియో లేమియో కలయంతదానితో తమయిల్లు జేయునందనమునట్లు
భర్తయెట్టిడునైన పావనాశయముల త్రోవజూపించును ధ్రువముపోల్కి
పతిగూడి పరరాష్ట్ర భాగంబులందున్న మాతృభాషను తానుమరువకుండ
సత్సంతతింగాంచి చదువుసంధ్యలునేర్పి ఉన్నతార్థములకు నూలుకొలిపి
యింటికింగృహలక్ష్మియై యొసగి భర్త
మొదటిమంత్రియునై యాత్మపుత్రకులకు
తొంటియొజ్జయునై మించు తోయజాక్షి
భారతావని కనినట్టి భాగ్యరాశి!
చిన్నారియాటల జిలిజిలిపలుకుల మనప్రేమసూత్రముల్ పెనయగలిగె
కన్యనిచ్చినవారు గౌరవోదారులన్ వియ్యాలవారి మన్నింపుగలిగె
పతిగూడివచ్చగావచ్చి తాపుట్టింటపడుచు పండుగ ముద్దునడుపగలిగె
దౌహిత్రుమూలాన తరతరంబులవారి అమరత్వసంసిద్ధి యమరగలిగె
మనకుగలిగినదొక్క యమ్మాయెగాని
ఆమెయందున్నవిన్ని మహత్యములును
లోకకల్యాణకర్త వేలుపులపెద్ద
తమ్మినునుమొగ్గ బొజ్జ సందడిలినట్లు!

# గృహపరిశ్రమలు

ఏ గృహవాసులు వస్తువులను తయారుచేయుదురో, ఆ వస్తువులు ఆ ఇంటిలోనున్నవా రుపయోగించుకొనుటకు సరిపోవునంతమట్టుకే గాని, ఆగ్రామములోని వారికి విక్రయించుటకు చాలినన్ని గాని యుత్పత్తిచేయు వానినే గృహపరిశ్రమలందురని ఈమధ్య ఆంధ్రపత్రికలో నేను చదివియుంటిని. నేడును మనదేశమునందు గృహపరిశ్రమ లుచ్ఛదశలో లేకున్నను నామమాత్రావశిష్టములుగా మాత్రమున్నవి. మా గృహమందు మాత్రము మాకు గావలసిన పండ్లపొడి, తలనొప్పి మందు, వేసవిలో వాడుటకు నిమ్మనూనె (Lime-juice glycerine) మొదలగువానిని నాతీరిక కాలమందు తయారుచేసుకొనుచుందును.

మన నిత్యకృత్యములలో పలుదోముట రెండవది. మాయింట నెలకు సుమారు 2 అణాలు ఆ పండ్లపొడి కగుచుండెడిది. నేను చేయుట మొదలిడినదాది ఆరెండణాలుఇచ్చి సామానులు తెచ్చిచేసిన సుమారు 4 నెలల వరకు సరిపోవుచున్నది.

### పండ్లపొడి:

| | | |
|---|---|---|
| శుద్ధిచేసిన సుద్దగుండ | 6 | తులములు |
| పటిక | 3 | ,, |
| లవంగాలు | $1\frac{1}{2}$ | ,, |
| కారపుచెక్క | $1\frac{1}{2}$ | ,, |
| కరకకాయలగుండ | $1\frac{1}{2}$ | ,, |

పైసామగ్రి బాగుగా ఎండించి చూర్ణములు వేర్వేరుగా చేసి పిదప అన్నియుకలిపి వాడుకొనవలెను.

సుద్దను శుద్ధిచేయుట:—సుద్దను మృదువుగ చూర్ణించి దానిని అంబలివలె యగునట్లు నీళ్లలోపోసి కలిపి అడుగునకుదిగిన ఇసుక మొదలైనవి తీసి సుమారు ఒకదిన మట్లుంచవలెను. తరువాత మీద తేరిన నీరు నావలపారబోసి అడుగునున్న చిక్కనిముద్దను ఒక పీటమీదగాని, మరేదైన నున్ననిపలకమీదనైన ఆరబోసి, ఆరినపిదప మరల పొడిజేసి వాడవలెను. వలయువారు తినతగిన గులాబిరంగు వాడవచ్చును.

బి. సీతమ్మ.

---

గమనింపు:—

## గృహపరిశ్రమలచే ధనము గడించుటెట్లు?

పై సమస్యపై ఉత్తమవ్యాసముల రచించిన సోదరీమణులకు ప్రథమ ద్వితీయ తృతీయ బహుమతులుగా రు 5, రు 3, రు 2 ఇవ్వబడును. సంపాదకుల తీర్మానమే అంత్యముగా పరిగణింపబడును. ఆపరిశ్రమ యీక్రింది నిబంధనలననుసరించి యుండవలయును. 1. గృహిణులు ఇలువీడకనే స్వయంసహాయముతో చేసికొనుటకు తగియుండవలయును. 2. ఆ పరిశ్రమయందు విదేశవస్తువుల నుపయోగింపక అన్నివస్తువులును స్వదేశీయములై సులభముగా లభించునవియై యుండవలయును. 3. ఆ పరిశ్రమ అనుభవసిద్ధమై గృహకృత్యముల కడ్డురాక యుందరి అందుబాటులోనుండవలయును. 4. ఈపరిశ్రమవలన తయారగువస్తువులు అందరికిని అత్యావశ్యకమైనవిగనుండి త్వరగా ఖర్చుగావలయును.

## మగని చెవిలో

'అనసూయ'

(బులెటు లైసెన్సుగురించి)

ఆడవాళ్లను శాసనసభలకు రానిస్తారట! నాకు వెళ్లాలని మహావుంది. అచ్చట నేను చేసేదేమిటా? యిప్పుడు వెళ్లినవారు ఏమిటి మహా చేసివేసేరు? నేను చేయలేకపోయే దేమిటి? రోజూ నాముఖంమీకూ మీ ముఖంనాకూ కనపడడం మీకు చికాకుగా ఉంటున్నాది. పదిరోజులపాటు యెడబడితే మనిషిమీద కొంతగౌరవమువుంటుంది. నా పుట్టింటివారుఉన్నా లేనిలోనే జమగదా! వారు యిచ్చటికి రావడానికి మీ మన స్సొప్పదు, మీఅమ్మా అప్పా రానివ్వరు. నేనూ నాపిల్లలూ అచ్చటికివెళ్లి ఉండడానికి, వాళ్లు మమ్మలిని భరించలేరుగదా! ఒకప్పుడు ఎంతగొప్పవాళ్లైనా ఇప్పుడు చితికిపోయినారన్నసంగతి మీకూ తెలుసును. ఇకను ఎలాగు మనము ఎడపడడం? ఈ శాసనసభలమూలంగా వారం పదిరోజులు దగ్గరలేకుండా ఉంటూఉంటే మీప్రాణమైనా హాయిగాఉంటుంది. పట్టుకొన్న నోవలు పూర్తిఅయేదాకా నా బాధ లేకుండా చదువుకోవచ్చును. నాగురించి మీకు శ్రమా, కష్టమూ, ఆతృతా తప్పిపోతాయి. క్లబ్బునుండి వేగమువచ్చేరో ఆలస్యముగావచ్చేరో తర్కించేవారుండరు. అన్నివిధాలా మీ ప్రాణం సుఖపడుతుంది.

అంతకన్నా ముఖ్యముగా ఒకదానికి నేను శాసనసభకు వెళ్లాలనిఉంది. ఇంగ్లీషు రాజ్యము వచ్చినదగ్గరనుంచీ లైసెన్సులేనిదే తుపాకీ ఉంచుకోకూడదని చట్టము ఏర్పాటు చేసినారుగదా! అది ఎందుకోసము? అన్యోన్యమూ ప్రమాదములేకుండా చేయడానికేనా? అయితే, అంతకంటే ప్రమాదకరమైనవస్తువును లైసెన్సులేకుండా ఎక్కడబడితేఅక్కడ, ఎవరుబడితేవారు, ఉంచుకోవడం తప్పుకాదా? అది తమను బాధించదు గనుక గవర్నమెంటువారు ఇన్నాళ్లైనప్పటికీ ఊరుకున్నారుగాని శాసనసభకువెళ్లి స్వదేశ మహిళాజనోద్ధరణమునకు కంకణముకట్టుకొనే స్త్రీఎవతె మొదట దానినిగురించి చట్టము ఏర్పాటుచేయించకుండా ఉంటుంది.

కాబట్టి ఆకీర్తి, కితాబు, నాకుదక్కాలని ఉంది. శారదాఆక్టులాగు నా ఆక్టుకూడా పల్లెలూ పట్టణాలూ అల్లుకోవాలి. దానివల్ల నేనేకాదు. నాతోపాటు అనేకమంది స్త్రీలు అపరిమితమైన లాభంపొంది కష్టములుతొలగి, సిరిసంపద కలిగియుంటారు!

'ఏమిటీ తైసెన్సుల ధోరణి' అంటారా? ఏమీలేదు — బుల్లెటులైసెన్సు! ఒకమారు నోవలుమాని ఆలోచించుకుంటే తెలుస్తుంది! రోజూ నాప్రాణం రాలిపోతూవున్నది. ఏమన్నా మాట్లాడని మీరీవన్నె! ఏమయినా అనకుండానే యెత్తిపోసే మీ అమ్మా అప్పా ఆవన్నె! వారికీ నాకూ యేజన్మ శత్రుత్వమోగాని అరనిమిషమైనా

పడదన్న సంగతి ఆమూలాగ్రముగా మీకు తెలుసును. వారి దెబ్బలాట నేర్పుచూడాలి కాని చెప్పడానికి తరముకాదు. వారి బాధ పడ్డవాళ్లకిగాని వారుపెట్టే బాధమోస్తరు తెలియదు. 'అనుభవరసికో విజానాతి.' బాగాఅన్నారు. అలాంటిదే – నేను యేమి చేసినా రుచించదు; నేను యేమిచేయకుండినా దెబ్బలాటతప్పదు. చండేచండి! వారేవారు! వారి నోరుకట్టించలేరు గదా మీరు! నాసొద నేను వెళ్లబుచ్చడమేగాని మీకు యింతపిసరైనా జింహ్వాలేదుగదా?

'తామరాకుమీద నీరులాగుండాలి!' తామరాకుమీద నీరులాగుండాలా! ఒక రోజున మీకు నాలాంటి అనుభవము అయితే తామరాకుమీదనీటి సంగతి తెలిసి వస్తుంది. మీకు చేతకాదు. ఎందు కిన్నికబుర్లు! అందుచేతనే నేను శాసనసభకు వెళ్లితీరాలి! నాలాంటివాళ్లు ఇంకా అనేకమంది అనదలున్నారు. నాలాగే జింహ్వాలేని మొగుళ్లను గలిగి బాధపడుచున్న భార్యలున్నారు. తలచెడ్డవాళ్లను యింట్లోవుండనిచ్చుటకు యజమానికి లైసెన్సులేనిదీ పనికిరాదనీ, ఉంచితే నేరమనీ, ఒకచట్టము సభలో ప్రవేశపెడతాను. తుపాకీ ఉంచుకొనుటకూ మోటారు నడుపుకొనుటకూ లైసెన్సులు కావాలిగాని అంతకన్నా అపరిమితముగా ప్రమాదకరమైన యీతుపాకీ గుళ్లను ఉంచుటకు లైసెన్సు అవసరములేదా? ఆతుపాకీ పేలిస్తే ఆకారు మట్టించేస్తే, క్షణములో సర్వమూ సమాప్తము. అది బాధలేదు. కాని యివి అట్లుకావే! భీష్ముడి అంపశయ్య! వాటి దెబ్బతగిలితే ప్రాణాలు ఉండవు, ఊడవు. నిత్యమూ మనస్సులో శల్యములు.

వాళ్లను అదుపాజ్ఞలలో ఉంచగలిగే వాళ్లకేలైసెన్సు! లేనివాళ్లకు దినదిననేరము క్రింద శిక్షవిధించాలి! సిటీ అక్టు తణిఖీలాగు పోలీసువాళ్లు ప్రతిరోజూ తణిఖీచేస్తూ ఉండాలి. అప్పటికిగాని యీదేశారిష్టము తొలగిపోదు.

వారివల్ల యెన్నోలాభాలు ఉన్నాయా? లాభాలులేక నష్టాలువస్తే ముష్టెత్తుకో వచ్చునుగాని వాళ్లబాధ యెవరు పడగలరు బాబూ! వాళ్లుంటే తామరాకుమీద నీరులాగు కాదు మనకు,–ఒంటినిండా తామర ఉన్నట్లే! గోకడం తప్పదు; గోకితే మండక మానదు!

'గాంధీమహాత్ముడు చెప్పినట్లు సహనం ఉండాలి.' సహనం ఉండాలా? మాట్లాడితే గాంధీమహాత్ముని సంగతులు నామీద ప్రయోగించకండి! గాంధీ చెప్పినట్లు మీరు చేస్తున్నారా? కోర్టులు మానేశారా? కాఫీలు సిగరెట్లు కట్టిపెట్టగలిగేరా? మాలవాళ్లలో కలసిపోగలరా? గాంధీ తన అమ్మా తన అక్కా దగ్గిర హడలెత్తుతాడా? మీరూ నేనూ ఆ మహాత్ముడిలాగు జీవన్ముక్తులమైనమీదట సహనంగురించి ఆలోచించుకొందాము. అదీకాక గాంధీమహాత్ముని సహనం పచ్చిమగతనము; మీ సహనం చచ్చుఆడతనము. మీఅమ్మా అక్కా–

ఏమి తూలనాడినా ఏమి సబబూ సందర్భమూ లేని జట్టీపెట్టినా, ఏమి కాల్చుకొని తిన్నా, మీరు మాట్లాడకుండా ఉండడం సహనమూ సత్వగుణమూ అనిపించుకుంటుందా? అది సత్వగుణము కాదు తమోగుణము! సాధుత్వముగాదు, చచ్చుతనము! ఈ ప్లీడరీవృత్తిలో పూటకు పుట్టెడు అబద్ధాలుఆడే మీకు సత్వగుణమేమిటి? సత్వానికి సత్యము పునాదుకాదా? పోనీయండి! మీరు చెప్పేసహనం మీ మనస్సులో ఉందా? పైకి మాట్లాడకుండా లోలోపల కుళ్లికుమిలితే అదా సహనం. సాధుత్వము? 'శక్తి చాలనివాడు సాధుత్వము వహించును' అన్నమాస్తరే కదూ అది! సరికదా మరొకమాట. రామకృష్ణ పరమహంస యేమని చెప్పేడు పాము కథలో! 'కరవకుగాని బుసకొట్టు' అన్నాడా లేదా? బుసకొట్టకపోతే ఆ మంటుబుక్క-డాన్ని ఎవరుచూస్తారు? ఎవరు కాతరు చేస్తారు? కుట్టుతుందని భయములేకపోతే తేలుకీ కుమ్మరపుర్వుకీ భేదమేమిటి?

అందుచేత నన్ను శాసనసభకు వెళ్లనిచ్చినాసరే, లేదా మీగుళ్లబారును ప్రమాదములేకుండా ఉంచుకొనుటకు తగిన శక్తి, యోగ్యత, మీరు సంపాదించుకొన్నా సరే! లేనియెడల నాకు మరేదీ దారి కనబడలేదు. చూచిచూచి ప్రాణంవిసికి యేమిచేస్తానో దేమునికే యెరుక! మా పిన్నమ్మ యేమి చేసింది! ఆలాగే భరించలేకపోతే దారి ప్రాణత్యాగమే! తరువాత మీరు విచారిస్తే ఏమికార్యము! మీకా విచారము? మీ కేమిటి విచారము? మీ కెందుకు విచారము? మీ నోవలులు మీ క్లబ్బు ఉంటే చాలు; తక్కిన లోకమంతా తల్లక్రిందులైపోయినా మీకు కాతరులేదు! అంతెగదూ! ఏం! మాటాడరేం.




## శాస్త్రి హోటలు అనగానేమి?

ఆరోగ్యభాగ్యమునిచ్చు ఆహారములకు
అల్పాహారములకు పుట్టినిల్లు.

వీర్యబలమునిచ్చు మధురపదార్థములు, చలిదేశమునకు అనుకూలమైన శయ్యాగృహములు, దంపతులకు తగిన యేర్పాటులు.

## శాస్త్రి హోటలు

89 చిక్‌పేట — బెంగుళూరు సిటీ.

# లౌక్యం

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

ప్రపంచమంతా కేవలం లౌక్యంకిందికే పరిణమిస్తోంది. పూర్వం లౌకికులు ఛాందసులు అనివుండే వారు. ఇప్పుడా భేదాలేమీ లేవుగాని, కాంగ్రెసనీ, జస్టిసనీ, ఇండిపెండెంటనీ, లేబరనీ, నేషనలిస్టనీ, సోషియలిస్టనీ, ఏమిటో నానారకం అనొదవమనకెందుకు గానీ అసలు కథకివద్దాం. పూర్వం పద్ధెనిమిదిమూర చీరలుండేవి దళసరిగా. ఇప్పుడు పదిగజాలు పదిమూళ్లా. ఇంకా లౌక్యంగావుండేటివి కట్టేస్తున్నారు. 'కేశ సంస్కారధూపైః' అన్నాడు కాళిదాసు. ఆకాలం యిప్పుడులేదు. కృష్ణభుజంగ వేణులంతా లౌక్యంగా ఉండాలని బాబ్ జుట్టుమరిగారు. కేశములే లేనప్పుడు ధూపం యెక్కణ్ణుంచివస్తుంది. దండాపూపన్యాయమే.

నూనె, పసుపు, శీకాయి, నలుగుపిండి, ఇవన్నీ లేకుండా క్రీము, సబ్బు, ఇవిరెండేసాధనాలు. లౌక్యంగా ఇక రవికలుకుట్టడంలో రెట్టలు వేరే, మెడ వేరే, వీపు వేరేగా కత్తిరించి ఇవన్నీ మళ్ళీ ఏర్చికూర్చికుట్టేవారు మునుపు. ఇప్పుడో అన్నీ వకేబట్టలో వచ్చేసేలాగు కుట్టేస్తున్నారు. లౌక్యంగా పనిముగించాలనీ. అసలు రెట్టలేవీ రవికలకు! 'Economical point of view' అంటారు. విద్యావతులు నేరుమయ్యాలిసిందే చప్పని. పృచ్ఛకులు చదువంటే మహాలౌక్యంగా ఉందిలెండి. ఓనమః, శివాయః, సిద్ధంనమః, పీటితో ప్రారంభించి క్రమంగా గుణింతము, ఎక్కాలు, ప్రభవలు, పక్షాలు, నక్షత్రాలు దిక్కులు దిక్కుల్నిపాలించే దేవతలు వాళ్లభార్యలు వాళ్ల ఆయుధాలు రాసులు, ఘడియలు, అన్నీవస్తేనేగాని మొదటితరగతి అనిపించుకోదు మునుపు. 'ప్రభవ'లెందుకూ ఉత్తరోత్తరా ఇంగ్లీషు చదువుకునేవాడికి ఏం పంచాంగం చెబుదాడాఅంటూ ఇప్పుడు 'అ ఆ'లనుండి ప్రారంభంచేసి గుణింతాలు లేకుండానే పేర్లు చదవడము అలాగే నాలుగోతరగతి దాకా నెట్టేస్తారు. ఆక్కడినుంచీ Cat పిల్లి అంటూ నేర్పడం. అమావాస్య పౌర్ణమిఅంటే ఏమిటో అసలు 5-వ తరగతి కుర్రాళ్లకే తెలీదు. ఇకరాసులంటే మట్టి రాసులు ధాన్యపురాసులే. ఎందుకు చెప్పొచ్చానంటే నవీన విద్యావిధానంలోను లౌక్యం ఉందని సిద్ధాంతీకరించడానికి. ఇంతకన్న విచిత్రంగా లౌక్యం చిత్రకళ లోకిగూడా దిగబారింది. వెనకటికి చిత్రకళాకారులు దనిపించుకున్న రవివర్మ లౌక్యం ఎరగక ఛాందసరిగా మొగానికిదగిన కాళ్లూ చేతులూ తక్కిన అవయవాలన్నీ గూర్చిరాసేవాడు జీవకళ ఉట్టిపడేటట్టు. ఆచిత్రాలకు విలువలేకపోలేదులెండి. ఏమంటారు? వెనకటికి చిత్రకారులు ఏమహారాజులవైనా ఛాయాచిత్రాలు వ్రాయాలంటే కష్టపడివారి వారి సర్వావయవాలు నఖశిఖపర్యంతం వ్రాసివ్రాసి చచ్చేవారు లౌక్యం తెలీకా. ఇప్పటికళాకోవిదులు 'సర్వస్యగాత్రస్యశిరః ప్రధానమ్మ'ని మంత్రులవీ మహామహులవీ తలలు మాత్రం పత్రికలలో ఘనంగా కనబడేలాగ కాళ్లూ చేతులూ సన్నంగా కుంటివాడిలాగ రాసేస్తున్నారు. Our Cortoonit sees him అంటూ పత్రికల్లో వస్తమామూలేగదండీ. పాపం వాళ్లు అందంగాపుట్టి వికృతాకారంగా కాగితాల్లో శాశ్వతంగానిలిచి పోవడం విచారమేగదండీ. కురూపులైనా చిత్రకారుల చేత దీర్చిదిద్దించుకొని అందంగా కనబడేవారు. ఇంకా రెన్నాళ్లుపెడితే 'సర్వేంద్రియాణాంనయనమ్ ప్రధానమ్మ'ని కళ్లుమాత్రం రాసేస్తారేమో చిత్రకారులు. అయితే అప్పటికి దాన్నికూడా తెలుసుకోగలిగే కుశలాగ్రబుద్ధుల్ని భారతమాత సృష్టిచేస్తుందేమో?

# శారదలేఖలు

సౌభాగ్యవతి కల్పలతకు :

నెచ్చెలీ! నేను నీ కిన్ని దినములనుండియు జాబు వ్రాయని కారణము నీపై కోపగించియు గాదు. ప్రేమ తగ్గియుగాదు. మఱచియు కాదు. కల్పలతా! మన స్నేహము ఒకటి రెండు మాసములు జాబులు వ్రాయనంతమాత్రమున విచ్ఛిన్నమగునదా? ఎంత వెఱ్ఱిదానవు? కొన్ని మాసములుగా నా శరీరములో నారోగ్యములేదు. సర్వస్యగాత్రస్య శిరఃప్రధానమ్. సర్వేంద్రియాణాం నయనమ్ ప్రధానమ్ అని యెయ్యవి ప్రధానముగా చెప్పబడునో నాకు వానియందే జబ్బు ప్రకాశించినది. కొంచె మాలోచించిన తలలో బాధ. కొంచెము వ్రాసిన కనులలో బాధ. ఇక చేయవలసినదేమి? అన్నిటికిని స్వస్తిచెప్పి కూర్చుంటిని. ఇంతలో గృహపరిశ్రమల విషయమై నీవు వ్రాసిన లేఖ చేరినది. తిరిగేకాలు తిట్టెనోరు ఊరకుండదు అన్న సామ్యముగ వ్రాసేచేయి గూడ యూరకుండదు కాబోలు. ఆలేఖ చూడగనే నీకు జాబు వ్రాయవలయునని బుద్ధిపొడమినది. కుతూహలము నాపుకొనజాలకపోయినాను. బలముడిగిన బక్కయెద్దును బండివాడు బలవంతముగా బండికి గట్టి తోలినట్లు జవసత్వములుడిగి పనిసేయ నిరాకరించుచున్న శిరోనేత్రములను నశ్వముల లేఖినీశకటమున కంటగట్టినాను. ఇక సిది కడవఱకుసాగునో; మధ్యనే మొత్తుపడి నిలిచిపోవునో? అది దైవాయత్తము.

నెచ్చెలీ! నీకేగాదు, నాకేగాదు. స్త్రీలెల్లరి హృదయముల నీ పరిశ్రమల విషయమున నాలోచన పొడముచునేయున్నది. సామాన్యకుటుంబినులు సంపన్నకుటుంబినులుగూడ నీవిషయమై పృచ్ఛ చేయుచునే యున్నారు. ప్రస్తుత దేశకాలపరిస్థితులు, స్త్రీల పరిస్థితులుగూడ స్త్రీలు గృహపరిశ్రమల చేపట్టవలసిన నావశ్యకత నిరూపించుచున్నవి. దేశశ్రేయమునకును మహిళాశ్రేయమునకునుగూడ నిది యావశ్యకమే యగును. కాని గృహపరిశ్రమలన్ని నేవివో? వాని నవలంబించవలసిన మార్గములేవివో? అవి చిన్నచిన్న యంత్రసహాయమున చేయవలయునో లేక చేతితోనే చేయవలయునో ప్రాచీనగృహపరిశ్రమల పునరుద్ధరించిన చాలునో, నవీన గృహపరిశ్రమల నేవినైన కల్పించుకొనవలయునో వానిని నేర్పువారెవరో, నేర్చుకొనుటెట్లో వాని విడుదలకు మార్గమెయ్యదియో, వానివలన చేకూరు నార్థికలాభమెట్టిదో అని ఆలోచించినదేనికిని దారి కన్పడదు. అంతయు నంధకారబంధురము. ఒకవిధముగా నీ గృహపరిశ్రమల యాందోళనము పప్పులేవు, బియ్యములేవు, పులగం పులగం అన్న సామ్యమును జ్ఞప్తికి దెచ్చు

చున్నది. బ్రిటిషువారి పరిపాలన వచ్చినది మొదలు మన భారతస్త్రీలు గృహపరిశ్రమల పూర్తిగా విస్మరించిరి. పురుషులు సంపాదించిన సొమ్మును తేరగా తినుచు పైసీమనుంచివచ్చిన వస్తువులతోనే యలంకరించుకొనుచు గృహకృత్యములను చేసికొనుటకుగూడ నోడలువంగక నౌకరులచే చేయించుకొనుచు పురుషులకు సహాయముగాని కుటుంబమున కాదాయముగాని తమకేలాటి లాభముగాని లేక పరులకు భారముగు బానిసజీవనమున కలవాటు పడిపోయినారు. స్త్రీ యెంత సోమరిగనుండిన నంత గొప్పయను దుర్భావముగూడ స్త్రీలలో బాగుగా ప్రబలిపోయినది. దేశమున నే ప్రాంతముననైన జూడుము. మన భారతస్త్రీలస్థితి యివ్విధముననేయున్నది. ఎప్పుడు స్త్రీలలో నీ దుర్భావమును సోమరితనమును ప్రబలిపోయినదో అప్పుడే వారి పారతంత్ర్య శృంఖలలు మఱింత బిగిసికొనిపోయినవి. డబ్బులేనివారు దుగ్గానికి కొఱగారు. పెత్తనమనగా డబ్బుపెత్తనమే పెత్తనము. లక్ష్యమనగా డబ్బులక్ష్యమే లక్ష్యము. గౌరవమనగా ధనగౌరవమే గౌరవము. భాగ్యమనగా సొంతభాగ్యమే భాగ్యము. పరులయనుగ్రహముపై నాధారపడి యనుభవించెడి సిరిసంపదలుగావు. అవి అవిచ్ఛిన్నముగా ననుభవించుటకు వీలులేదు. కావున స్త్రీ శోచనీయమైన యీ స్థితినుండి యుద్ధరింపబడవలయునన్నచో సొంతముగా ధనము సంపాదించుట నేర్చుకొనవలయును. అందుల కుత్తమమైన మార్గము గృహపరిశ్రమల నవలంబించుట.

మన భారతదేశమున స్త్రీలసంఖ్య దాదాపు 17 కోట్ల 60 లక్షల 63 వేలు. కేవలము పేదతనముచేత పొట్టగడవక అయ్యో అందఱివలె కూర్చుండి తినుటకు లేకపోయెనేయని లోలోన దురపిల్లుచు కాయకష్టము చేయువారుతప్ప తక్కినవారెల్లరు తిని కూర్చుండువారే. కరచరణాద్యవయవములు గలిగిన యింతమంది స్త్రీల శక్తి వ్యర్థమైపోవుచున్నప్పుడు భారతదేశమెట్లభివృద్ధినందగలదు? కాన స్త్రీలు గృహపరిశ్రమల చేపట్టుట వారి స్వలాభ హేతువేగాక దేశాభ్యుదయమునకుగూడ హేతువే యగును.

మఱియు స్త్రీలు గృహపరిశ్రమల నవలంబించుట వారికిని దేశమునకును లాభకరమగుటయేగాక పురుషులకుగూడ లాభకరమేయగును. ఇప్పుడు ద్రవ్యసంపాదనాభారమంతయు పురుషులమీదనే పడియుండుటచేత తల్లి తోబుట్టువులు, భార్య, కొమార్తెలు వగైరా స్త్రీ లెంతమంది యున్నను వారందరి నొక్క పురుషుడే పోషింపవలసియున్నది. ప్రస్తుతపరిస్థితులలో నిది యెంత భారావహమైన సంగతియో చెప్ప నగత్యములేదు. ఇందువల్ల ఒక్కొక్క కుటుంబములో నెంత యసంతృప్తి! యెంత కల్లోలము! పురుషుని కెంత హృదయవేదన! స్త్రీ కెంత ఛీత్కారములతో గూడిన దుఃఖదారిద్ర్యపీడ కలుగుచున్నదో అనుభ

వైకవేద్యము. మగవాని సంపాదనాకష్ట మెఱుగక స్త్రీ యది కావలయు నిది కావలయునని పోరుట స్త్రీ లేమిడితనపు టిక్కట్ల నెఱుగక మగవాడు చీదరించుట గొప్ప గొప్ప సంపాదనాపరులైన వారి కుటుంబములలోలోనే యీ యార్థిక సంబంధములగు కలహములు మనోవేదన కరములుగానుండును. ఇక సామాన్య కుటుంబములలో నీ విషయప్రస్తావన కాలాగ్నితుల్యమే. స్త్రీ పురుషుల సుఖ స్వాస్థ్యముల కింతకంటె భంగకరమగు విషయము వేరొండులేదు. ఈ దుస్థితి తొలగవలెనన్నచో స్త్రీలు గృహపరిశ్రమల చేపట్టవలెను.

పూర్వకాలమున గృహపరిశ్రమలు స్త్రీల చేత పరిపాటిగా నిర్వహింపబడుచుండెడివి. నూలువడకుట, రంగులద్దుట, తలనూనెలు కాచుట నలుగుబిండ్లు తయారుచేయుట, కాటుక, కుంకుమ, పసపు వగైరాలుచేయుట పెరుగు, వెన్న, నేయి మున్నగువాని యుత్పత్తి, కూరగాయలు కాయించుట, పూవులు పూయించుట, విస్తళ్లు కుట్టుట, రవికలు కుట్టుట మున్నగునవన్నియు స్త్రీలు చేసెడివారు. ఇందువలన కుటుంబమున కెంతయో సహాయము చేకూరుచుండెడిది. భోజనభాజనాదుల కుపయోగపడెడి యిట్టి పరిశ్రమలనేగాక మనోహరములగు విలాస వస్తువులందుగూడ కళాకుశలలగు ప్రాచీన నారీమణులు మంచిపరిశ్రమ చేయుచుండిరి. స్త్రీలకును చతుష్షష్టికళలుండెను. పూల మాలలు కట్టుట, జడలువేయుట, సుగంధ ద్రవ్యములు తయారుచేయుట, చిత్రవిచిత్ర వంటకములు, వ్యంజనములు, పానీయ ములు, శయ్యాలంకరణము, గృహాలంకర ణము, దేహాలంకరణము, ద్వారాలంకర ణము, చిత్రలేఖనము, దారుశిల్పము, బొమ్మలు చేయుట, ముగ్గులు తీర్చుట, తెలుఁగు వ్రాయుట మున్నగు కళావిశేషము లెన్నిటియందో స్త్రీలు ప్రజ్ఞావతులై యుండిరి. అయితే అప్పటి స్త్రీలకున్న సౌకర్య మిప్పటివారికి లేదు. పైగా అత్యంతప్రతి కూల పరిస్థితులలో స్త్రీలు పరిశ్రమలు సాగింపవలసియుండును. ఏలననగా ఈకాల మునందు ప్రతివస్తువునకు ప్రతివస్తువు పైదేశమునుండి యీదేశమునకు దిగుమతి యగుచున్నది.

చూడుము. రాట్నమున్నది. ఇదిప్రాచీన మగు గృహపరిశ్రమ. ముఖ్యముగా స్త్రీ లెల్లరవలంబింపదగు పరిశ్రమ. పూర్వమును నిది స్త్రీలకే దత్తమైయుండెను. ఇందశేష భారతజాత్యభ్యుదయ సౌభాగ్యచిహ్నములు కలవు. నూలుపోగుపై స్వరాజ్యమాధార పడియున్నదని యిప్పటికిని ఘంటాపథముగ చెప్పుచున్న మహాత్ముని వాణి అమృత వాణియే సందేహములేదు. కాని ఆకర్ష వంతమైన రంగులు, అందమైన మెఱుగులు గల వస్త్రములెన్నియో విదేశములనుండి వచ్చి దేశమందంతటను కారుచౌకగ విక్ర యింపబడుచున్నది. ఎంతయో దేశాభిమాన మును మనోనిగ్రహమును కలవారు తప్ప

సామాన్యముగా శృంగారలాలసతగల స్త్రీ
లీ వస్త్రవ్యామోహాతకు జిక్కువడకుండ
నెట్లుండగలరు? ఈయొక్క వస్త్రవిషయము
న నేగాక ప్రాచీన గృహపరిశ్రమల దిగ
నార్చెడి వస్తువులెన్నియో విదేశములనుండి
దిగుమతియగుచున్నవి. కుంకుమకుబదులు
ఎఱ్ఱరంగుసీసాలు మొదలు ప్రతివస్తువునకు
ప్రతివస్తువు పైనుంచి వచ్చుచున్నది. పూర్వ
కాలమున పరిశ్రమలున్నవన్నచో నప్పటివారి
నాగరికతకవి సరిపడినవిగానుండెడివి. పరదేశ
వస్తువులఆకర్షణగాని పోటీగానిలేదు. కావున
తాము వడికిననూలుతో నేయబడినవస్త్ర
ములతో వారు తృప్తిబడెడివారు. వారద్దు
కొనినరంగులు వారికి సంతోషము గొలి
పెడివి. వారు కాచుకొనిన తలనూనె వారికి
బాగుగానుండెడివి. నేడావిధముగా తమ
గృహపరిశ్రమలచేతనే తామానందించుట
యెట్లు పొసగును? తాముచేసిన వానికంటె
నవి బాగుగానుండునను భ్రాంతియొకటి
కష్టములేకయే డబ్బుపారవైచికొనెడి యల
వాటొకటి. వానిని ధరించిననేగాని నాగర
కుల మనిపించుకొనమను వెఱ్ఱి యొకటి.
అహో! ఎన్నని చెప్పవచ్చును గృహపరిశ్రమ
లకు ప్రతిబంధకములు! నేడు స్త్రీలు గృహ
పరిశ్రమ నవలంబింపవలయుననిన నన్నియు
నడ్డంకులే అయితే యివి దూరమునుండి
చూచిన నెంతయోదుర్గమ పథములుగా
గన్పట్టునేగాని స్త్రీలెల్లర మొకమాటనుకొని
దేశాభిమానముతోను జాత్యాభిమానము
తోను సంఘౌన్నత్యమాశించి కార్యక్షేత్ర
మున దిగిరేని యన్నియు సులభతమమే
యగును. ఐకమత్యమునకును సంఘీభావము
నకును జొప్పడని కార్యమేదియులేదు గదా.
ప్రస్తుతము మనదేశము నాగరికతయందెం
తయో పరివర్తనమందియున్నది. నవ్యము
లగు పరికరములు నలంకారములు జనుల
నాకర్షించుచున్నవి. కాన ప్రాచీనములతోనే
తృప్తిపొందుడని చెప్పిన యువజనుల
హృదయములు సంతృప్తినొందజాలవు. కాన
ప్రాతవానిని పునరుద్ధరించుకొనుచునే క్రొత్త
వానిని చేపట్టవలయును. ముల్లునుముల్లు
తోనే తొలగించినట్లు యంత్రములపై
యుత్పత్తియగు వస్తువుల నెదుర్కొనుటకు
చిన్నచిన్న యంత్రముల సహాయములను
గూడ పొందవలయును. ఈ పరిశ్రమల
విషయమై మార్చినెల గృహలక్ష్మియందు
సోదరి పులుగుర్తి శనకమ్మగారు గృహపరి
శ్రమలనుగుఱించి వ్రాసిన వ్యాసమును
నీవును చూచియుందువు. వారు గావించిన
సూచనలన్నియు నాచరణసాధ్యములై
యున్నవి. గృహపరిశ్రమలయందు కుతూ
హలముగల స్త్రీలెల్లరు వానినవలంబించెద
రని నమ్ముచున్నాను.

గృహపరిశ్రమల నాచరణలోనికి తెచ్చి
వస్తూత్పత్తిసేయుట నిక్కమేయైనచో వాని
విడుదలమార్గములుగూడ నన్వేషింపవలసి
యున్నది. ఇందుకు గ్రామగ్రామమున
మహిళాభాండారములేర్పడి విక్రయకార్య
క్రమమునకు తోడ్పడవలసియుండును. ఈ
సందర్భమున మన గృహలక్ష్మి చేయవల

సిన సహాయ మపారముగానున్నది. సోదరీ మణులలో నెవరే గృహపరిశ్రమ నెఱిగి యున్నను నద్దానిని దాపఱికములేక గృహలక్ష్మియందు ప్రకటించునట్లు గృహలక్ష్మి కృషి చేయవలయును. మఱియు గృహపరిశ్రమల కుపకరించు చిన్న చిన్న యంత్రము లేవైననున్నచో వాని వివరములు అవి దొరకుస్థలములు గృహలక్ష్మిలో ప్రకటింపవలయును. మఱియు గృహపరిశ్రమల విషయమై యొక వ్యాసమును వ్రాసిన స్త్రీ కంటె యొక పరిశ్రమ నాచరణయందు పెట్టిన యువతీమణికి బహుమాన మొసంగునట్లు ప్రకటింపవలయును. ఏలనందువా? కాగితములపై గావించెడి ప్రబోధముల కంటె ఆచరణరూపముననుండెడి వానికే ప్రాముఖ్యత నీయవలసియున్నది. స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములకై యుదయించిన గృహలక్ష్మి స్త్రీల యార్థికసౌభాగ్యమునకు గూడ తోడ్పడిన దయ్యేనేని తన ధర్మము నిత్తోధికముగా నిర్వహించినదగును.

కల్పలతా! కొందఱు మిత్రురాండ్రు గృహపరిశ్రమల విషయమై నన్ను పలుమారు ప్రశ్నించుచుండుటబట్టియు, నీవు గూడ నిదియే విషయమును ప్రస్తావించుటచేతను గృహలక్ష్మిగూడ నీవిషయమై పలుమారు హెచ్చరించుచుండుటచేతను దీని విషయమై నా మనస్సులోగూడ నొకవిధమగు భావోద్వేగము కలిగి నీ కీ జాబు వ్రాసితిని. ఏమైననేమి మనస్త్రీలలో కొందరియందైనను గృహపరిశ్రమాభిరతియు, ధనసేకరణాభిలాషయు కల్గినమాట వాస్తవము. ఇది క్రియారూపము వహించునేని స్త్రీల కెనలేనిప్రయోజనము కల్గు మాటయు వాస్తవము. ఇది భారతమహిళాభ్యుదయమునకు శుభసూచకమనుటకు సందియము లేదు. కాని యీశ్వరసంకల్ప మెట్లున్నదో!

1-3-37 మిత్రురాలు
భావపురి శారద.

# ఒక కప్ 'టీ'
# మీ శ్రమపరిహారము



బిడ్డలతో నాడుటన్నకెంత ప్రియముండినను శ్రమనొందుట నిశ్చయము. వారికి వీర్యము హెచ్చు గనుక యన్నిటి నమ్మ లాగుచున్నారు. పోవనుండిన, వారికెంత యాయాసము గల్గుచున్నదో చూడుడు. అయిన, దానికొక యుక్తికలదు. మీరు వారు యానందముగానుండుటకు నెమ్మదిగాకూర్చుండి "టీ" పుచ్చుకొనవలెను. ఈ శాంతమైన పానము శ్రమపరిహారమప్పుడేజేయును. కులాసగానుండుటకు "టీ"కి సమానమేదియు లేదు.



"టీ" జేయు క్రమము: శుద్ధమైన వేడినీరు. కొంచెము వేడిచేసిన శుద్ధపాత్ర. ఒక స్పూన్ "టీ" యొక్కొకరికిన్ని, మొత్తముగా నొకస్పూన్ యధికముగాను పాత్రములో వేసి, బాగుగా నుడకబెట్టిన నీటిని పోయవలెను. 5 నిముషములు తాళి, కప్పులలో పోసి, పాలు, చక్కెర చేర్చవలెను.

## సంసారసుఖము — ఇండియా "టీ"

1 K-30 RS.

# వీర బొబ్బిలి

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

బొబ్బిలినగరమునందు పెండ్లిజరుగుచున్నది. విజయరామరాజు పూర్వవైరమున సమయమరసి విదేశీయుడగు బుస్సీద్వార సహాయమున వివాహకార్యనిమగ్నులగు బొబ్బిలివారేమరియున్నతరి సైన్యములతో కోటజొచ్చి వారితో యుద్ధమొనర్పసాగెను. నిరాయుధులగు బొబ్బిలివీరులు శత్రువులకు వెనుదీయకపోయిరి. విజయనగరసైనికులు బుస్సీసైనికుల ననేకులజంపిరి. తుదకు బొబ్బిలిరాజవీరులు సమరమున వీరస్వర్గమునొందిరి. తమవారిపాటువిని బొబ్బిలిరాణియగు మల్లమ్మ తనసుతుని యెటులేని శత్రువులచే జిక్కకుండ రక్షించి యెన్నటికేని బొబ్బిలిసింహాసనమున నిల్పుమని తనదాదియగు వేంకటలక్ష్మికి బాలునప్పగించి తక్కుగలరాణులతో జోహారొనర్చినది. ప్రభుభక్తితత్పరయగు వేంకటలక్ష్మి రాజపుత్త్రునెత్తుకొని ప్రచ్ఛన్నవేషమున నరుగుచుండ బుస్సీసైనికులనుమానించి యామెను బాలునితో బుస్సీయెదుటకి బట్టితెచ్చిరి. బుస్సీ యామె సాహసమున కాశ్చర్యచకితుడై బాలుని తన కప్పగింపుమని సామదాన భేదోపాయములచే నడిగెను. అందుల కావీరాంగన కుపితయై యాతనితో నిట్లనుచున్నది.

ఉ. మానరనాథుదేవియగు మల్లమవీరసతీమతల్లి స
న్మానముతోడ బెన్ప నభిమానమె సొమ్ముగు వీరకాంతనై
పూనిక రాజవంశమును భూమినినిల్ప బ్రతిజ్ఞబూని బు
స్సీ నినుజూచిభీతిగొని పోదునె బాలునివీడి చేలనై.

పుట్టితి భారతావనికి భూషణమైతగు వీరబొబ్బిలిం
బట్టితి రాజపీఠమున బాలునినిల్పు బ్రతిజ్ఞ దేవితో
గట్టితి వీరకంకణము కాలునికైనను జంకబోవ నీ
యిట్టి బిభీషికల్ వినిన నెవ్వరు భీతిలువారలీధరం.

జన్యతలంబునం రిపులసంతతి తేజము మొగ్గుసూప రా
జన్యులు కీర్తికాయులయి సంగరభూమి నలంకరింప స
న్మాన్యచరిత్ర లాన్నృపులమానినులెల్ల జోహారొనర్ప నా
ధన్యులవంశమున్నిలుపు దాననటంచు కృతప్రతిజ్ఞనై.

క. వారల వంశాంకురమగు, నీరాజకుమారు గొంచునేగెడితరి న
న్నీరాజభటులుదెచ్చిరి, వీరబలనటంచునెంచి వీరబలనిటం.

చ. అలరులనాడుచుండుము గృహాంతరసీమల, పండితస్థలిన్
కలములబట్టి వ్రాయుదుము, కయ్యములందు నరాతిసేనపై
యలుగులజిమ్మ నేర్తుము, మహాభుజదర్పమెలర్ప రాజ్యముల్
పలుపగజాలువారము, భృశంబుగ నేమని మమ్ము నెంచితో.

క్షత్రియకత్తెలం బిదియెగాంచుచునుండగ నీసభాస్థలిన్
నెత్తురుటేరులై పరువ నీవిభవంబిట రూపుమాపి భూ
పోత్తమునన్నముల్ గుడుచుచున్న ఋణంబిదె తీర్తు సర్వలో
కోత్తరశౌర్య లక్ష్ములననొప్పుటెరుంగవె భారతాంగనల్.

సీ. అనుచు నావీరబాలశౌర్యాలవాల, పల్కుపల్కులవిని సంభ్రమము మెలర్ప
ననియెనాతండు చకితుడై యామెతోడ, శపథమునుదీర్చి బాలురాజ్యాభిషిక్తు
జేతునెటులేని సంకల్పసిద్ధవీవు, అవుఁ బరికింప శౌర్యధైర్యాది విజయ
లక్ష్మివీవాడు వేంకటలక్ష్మి మిమ్ము, వంటివీరాంగనల కున్కిపట్టుగాన
బొబ్బిలిని నెంతు వీరబొబ్బిలియటంచు.

---

# బిక్షుకుఁడు

మల్లాది కేశవరావుగారు

(ఒక నాటిరాత్రి వర్షములో)

కర్మమనుపేర నెపముతో కష్టపెట్టి
జీవులనుయిట్లు బాధించు చిద్విలాసి
కాని_అతనికీనిజముగా కరుణగలదె?
లేదు_నిజముగ నాయందు లేదు_ఏమొ?

ఉన్నచో నేలనన్నిట్టు లుసురుబెట్టి
కారుచీకటిచేదారి గానరీక
మేఘగర్జితవానయు మెఱుపులేల
కల్పనము జేయునా ముష్టి కడ్డుగాను?

కలడుదీనులపాలిటి కల్పతరువు
ఆర్తజనరక్షబిరుదుచే నలరువాడు
ఆదిమధ్యాంతరహితుడై యట్టివాఁడు
కలఁడు_కలడందు రెచ్చోట కాన_రాడె?

తడిపె నీపాడువర్షంబు దారిలోనె
'మాధకబళంబుతెల్ల'ను మాటరాదు
తాళగాలేను ఆకలి_తల్లి ఎవతె
పెట్టదేలకో_యీపాడు పొట్టకింత?

ఏలనిందింతు పెట్టనే లేదటంచు
పూర్వజన్మానవారెట్టి పూజచేసి
కాంచినారలో వైభవ కారిలక్ష్మి
ఏల_నాబాధవారికి ఎవరు_నేను?

కలుగబోవడునాఅంత కష్టజీవి
కడకువెతకినజగతిలో కన్నువిప్పి
దైవముంగూడబరువని దలచువాడ
నేను-ఒక్కడె! సృష్టిలో నెవడు-కలడు?

# శిశుగీత




ఎస్. శేషగిరిరావుగారు

అందమైనవాళ్లకు బుద్ధిమంతులు పుట్తారు.

పిల్లలు లేనివాళ్లు పిల్లల్ని పెంచుకుంటే పిల్లలు పుట్తారు.

పోటుసమయమున పుట్టుకలు ఎక్కువ.

ఏప్రిలు జూలై నెలలనడుమ మొగ పిల్లలు ఎక్కువగాపుట్తారు.

*　　*　　*

పిల్లలు ఒక సంవత్సర మయేటప్పటికే వాళ్ల భావాలేమో తెలియ చేయగలరు.

ఉత్తరాయణములో పుట్టినవాళ్లకు తెలివి ఎక్కువ.

వర్షాకాలంలో పుట్టినబిడ్డలకంటె ఎండాకాలంలో పుట్టినబిడ్డలు యెక్కువ తెలివిగా వుంటారు.

*　　*　　*

బిడ్డను తలచుకొన్నసే తల్లులకు పాలు చేపునకు వస్తవి.

తల్లిపాలు త్రాగు బిడ్డలకు డబ్బా పాలు త్రాగు బిడ్డలకన్న మూడురెట్లు నిరోధకశక్తి, జీవశక్తి ఎక్కువ.

శిశువులకు ఎక్కువలోహము కావాలి.

తల్లిపాలలో లోహమువుంది.

కోపముగ వున్నపుడు బిడ్డలకు పాలీయరాదు.

*　　*　　*

పిల్లలకు రాగిజావ మంచిది.

కమలాఫలరసం గుణం టొమాటోల గుణం ఒకటే. పిల్లలకు వీటిలో దేనినైనా ఉపయోగించవచ్చు.

బాదం,కొబ్బరిపాలు పిల్లలకు పుష్టి. ఇష్టం.

ఒకటీ రెండుమార్లు నీళ్లు త్రాగిస్తుంటే బిడ్డలకు లివర్ స్ప్లీన్లు పెద్దవి కావు.

పిల్లవాళ్లు వేన్నీళ్లు తాగకూడదు.

* * *

బెల్లం యెక్కువగా తింటే బిడ్డలకు పండ్లు చక్కగా రావు.

పిల్లలకు పండ్లజబ్బులు త్వరగా కలుగుతవి.

పిల్లలకు పండ్లబాధ హెచ్చు.

పండ్లు వచ్చేటప్పుడు పిల్లలు జలుబుతో బాధ పడుతారు.

పిల్లలు పండ్లువచ్చేటప్పుడు త్వరగా ఎదుగుతారు.

5,7 సంవత్సరాలమధ్యలో పిల్లలకుండే మొరటుతనానికి కారణం రెండోమాటు పండ్లురావడానికి ప్రారంభమగుటే.

* * *

క్షయరోగులు సాధారణంగా పసితనంలో మిక్కిలి లావుగా వుంటారు.

* * *

ఎముక పుష్టిలేనిపిల్లలు పుట్టేటప్పుడు యెక్కువ బరువు.

బిడ్డ దినానికి ఒక తులం పెరిగితే చాలు.

* * *

పిల్లడు ముక్కు వేసి రుద్దుతున్నాడంటే కడుపులో క్రిములున్న వన్నమాట.

* * *

పిల్లలరోగాలకు గాడిదపాలు సంజీవిలా పని చేస్తుంది.

ఉల్లి చేసిన మేలు తల్లికూడ చేయదు.

* * *

బిడ్డల మెడలో వుల్లిపాయలు కట్టితే పడగొట్టదు.

* * *

నడువలేనిబిడ్డలు కాసినిగింజలు ఆకులు నీళ్లలో వేసి కాచి ఆ నీళ్లలో కూర్చుండబెట్టే త్వరగా నడుస్తారు.

* * *

సన్నరాష్ట్రం బిడ్డలకు తినిపిస్తే త్వరగా మాట్లాడుతారు.

* * *

దోగాడితే నత్తి నివర్తిస్తుంది.

బనానాలు పిల్లలకూ ఆహారంగా వాడవచ్చు.

చిన్నతనంలో సరియైనపోషణ లేకపోతే చట్టి ముక్కు ఉంటవి.

దొడ్డికాళ్లు దంతవ్యాధులు సున్నము తక్కువగుట వల్ల కలుగుతవి.

సరిగా గమనించి ఆహారాలు ఇవ్వకవుంటే పిల్లలకు వ్రేళ్లుచీకటం అలవాటవుతుంది.

* * *

అంటురోగాలు చిన్నప్పుడువస్తే తిరిగి రావనుకోవడం భ్రమ.

* * *

బిడ్డలకు అజీర్ణమువల్లనే జలుబుచేస్తుంది. కాని నీరు త్రాగడమువల్ల కాదు.

* * *

ఆడపిల్లలకు ఈతి త్వరగా వస్తుంది.

15,16 ఏండ్ల మధ్య ఆడపిల్లలు ఇక పెరగడం మానుతారు.

14 ఏండ్లయితే ఆడపిల్లల ముఖాలిక మారవు.

అతిమూత్రముంటే పిల్లలు త్వరగా ఈడవరు.

* * *

కాళ్లు దొడ్డికాళ్లవుతవి పిల్లల్ని త్వరగానడిపించితే.

* * *

పాలు మఱిగించటం పాడుచేయడమే.

ఎప్పుడూ ఎత్తుకోడం పిల్లలకు చెడుపు.

పిల్లల్ని స్వేచ్ఛగా తిరగనివ్వకపోతే పెద్దలయాక వెనుకంజవేస్తారు అన్నిట్లో.

* * *

లావుపాటి వాళ్లదగ్గరికి బిడ్డలు సులభంగా వస్తారు.

* * *

ఎండ తగలకుండా బిడ్డల్ని ఒకటి రెండు గంటలు ప్రొద్దున బయటత్రిప్పడం ఆరోగ్యం.

పెరిగేవాళ్లకు గాలి ఎక్కువ కావాలి.

* * *

పురిటికి పురిటికి అయిదేండ్ల వారఉండటము తల్లి బిడ్డలకు సుఖము.

* * *

హిందూదేశమున 1000-కి 181 శిశు మరణములు,



శ్రీమతి అళఘు అమ్మయ్ ఆచ్చి. రామనాథ జిల్లాబోర్డు
సభ్యురాలుగా నియమింపబడిరి.

# నా దక్షిణదేశయాత్ర

పాలపర్తి రామమూర్తిగారు

ఒక్కొక్క మనిషికి ఒక్కొక్క విషయంలో ఎక్కువ అభిలాషవుంటుంది. దానికె పిచ్చ అని కొందరంటారు. కొందరికి సంగీతంపిచ్చ. కొందరికి నాటకాలపిచ్చ. కొందరికి సినీమాలపిచ్చ. కొందరికి కాఫీహోటల్సుపిచ్చ. కొందరికి త్రాగుడుపిచ్చ. కొందరికి ఎలెక్షనులపిచ్చ. కొందరికి ప్రసంగాలపిచ్చ. కొందరికి దైవభక్తిపిచ్చ. కొందరికి దేశదేశాలు తిరిగే పిచ్చ. కొందరికి యాత్రలు సేవించేపిచ్చ. యీవిధంగా ప్రతిమానవునికి ఏదోపిచ్చ పట్టివేధిస్తూవుంటుంది. ఈ పిచ్చల్లో నాకు యాత్రలు సేవించేపిచ్చ వుంది. దేశదేశాలు తిరగాలనీ అక్కడ విచిత్రాలు చూడాలనీ నాకు చిన్నప్పటినుంచి అభిలాషవుంది.

ఉదయం 6 మొదలు సాయంత్రం 6 వరకు ఆఫీసులో కూర్చుండి పనిచేసే నాబోటివానికి యీ బంధకాలాలోనుండి తప్పించుకొని కొన్నాళ్లు దేశదిమ్మరి కావాలెనని కోరికవుండడంలో తప్పులేదు. ఈలా తిరగడంవల్ల దేహానికి ఆరోగ్యం, మనస్సుకు సంతోషంవుంటుంది. ఈ యాత్రలవల్ల ఆరోగ్యమే కాకుండా కావలసినంత లోకజ్ఞానం కలుగుతుంది. బీదసాదల కష్టసుఖాలు తెలుసుకోటానికి అవకాశం వుంది. క్రొత్తక్రొత్త స్నేహితులతో పరిచయం ఏర్పడుతుంది. ఈ ఉద్దేశ్యాలతో నేను గుంటూరు నుండి పట్నం వెళ్లాను. అక్కడనుండి దక్షిణదేశ యాత్రలు సేవిద్దామని యస్. ఐ. ఆర్. కంపెనీవారు ఏర్పాటుచేసిన సీజను టిక్కెట్టు కొన్నాను. అది కొన్నరోజు మొదలుకొని 15 రోజులలో ప్రయాణంముగించుకొని రావాలె. ముక్కోటికి శ్రీరంగంలో వైకుంఠంగావుంటుందని అందరూఅంటే నేను పట్నంలో ఎగ్మూరు రైలుస్టేషనులో రాత్రి 8 గంటలకు రైలుఎక్కి తెల్లవారుఝామున తిరుచినాపల్లిలో దిగాను. అక్కడ మున్సిపల్ సత్రంలో బస చేశాను. ఇక్కడ గదికి దినానికి మూడుఅణాలు చార్జిచేస్తారు. అన్నివసతులూవున్నాయి.

## శ్రీరంగం

ముక్కోటిదినాల్లో శ్రీరంగంలో బసలు దొరకడం స్వామిదర్శనం కావడం కష్టం అని నేను తిరుచినాపల్లిలోనే బసచేశాను. తిరుచినాపల్లి నుండి శ్రీరంగంకు బస్సుచార్జీ అణా కానీ. బస్సుమీద శ్రీరంగం వెళ్లాను. అప్పటికే యాత్రికులు వేనవేలు బస్తీఅంతా నిండివున్నారు. తిరుచినాపల్లికి శ్రీరంగం రెండుమైళ్లు. మధ్య కావేరినదీ అడ్డం. నదిమీద పెద్దవంతెన కద్దు. చుట్టూ చల్లని టెంకాయ తోపులు గలవు. శ్రీరంగంచుట్టూ కావేరినది చుట్టివున్నది. శ్రీరంగం లంకని చెప్పవచ్చు. శ్రీరంగం చక్కని చిన్నబస్తీ. ఉత్సవదినాలగుటచే బస్తీఅంతా పలువిధములైన దుకాణములతోను, యాత్రికులతోను కళకళలాడుచున్నది. ఇక్కడ ఆలయంలో శ్రీరంగనాధస్వామి పవళించియున్నట్లు మూలవిరాటు విగ్రహమున్నది. దీనిచుట్టూ సప్తప్రాకారములున్నవి. నాలుగుదిక్కులను ఉన్నతములైన 14 గాలిగోపురములున్నవి. ప్రాకారప్రాకారము మధ్యను ఇండ్లు దుకాణములున్నవి. దీనిప్రక్కనే సహస్రస్తంభమంటప మున్నది. ఇది 450 అడుగుల పొడవును 130 అడుగుల వెడల్పును గలిగియున్నది. ప్రతిరాతి స్తంభముమీదను మంచి నగిషీపని చేసియున్నది. ఇది చాలా పురాతనమైనదేవాలయము. ఇది మహావిష్ణువుయొక్క భూలోకనివాసస్థానమని ప్రతీతి. ఇది విసిష్టాద్వైత మతస్థాపకుడైన శ్రీరామానుజాచారియొక్క నివాసస్థానమని చెప్పుదురు. శ్రీరంగదేవాలయంలో నొకచోట రామానుజాలవారి ఆలయంకూడా వున్నది.

ముక్కోటి నాడు ఉత్తరద్వారదర్శనంకొరకు హిందూదేశ వివిధప్రాంతములనుండి యాత్రికులు వత్తురు. ఈ ఉత్తరద్వారము సంవత్సరమున కొక్కసారి ముక్కోటినాడుమాత్రమె తెరతురు. ఈ ద్వారము దాటినవారికి మోక్షమని ప్రతీతి.

శ్రీరంగమునకు తూర్పున ఒకమైలు దూరంలో జంబుకేశ్వరం అను శివక్షేత్రము గలదు. శ్రీరంగమునకు వచ్చినవారు యీ శివక్షేత్రమునుగూడ దర్శింతురు. ఇక్కడవున్న లింగమునకు అప్పులింగమని పేరు. అప్పు అనగా జలము. పైకి చిమ్ముచుండు జలము మధ్య దేవాలయమున్నది. ఇచ్చటి అప్పులింగము దక్షిణాదినివున్న పంచలింగములలో నొక్కటి.

## తిరుచినాపల్లి

తిరుచినాపల్లి పెద్దపట్టణము. లక్షన్నర జనసంఖ్య గలది. పట్టణంమధ్య 260 అడుగుల ఎత్తుగల ఒక కొండవున్నది. దీని నెక్కుటకు చక్కని సోపానములు గలవు. ఈమెట్లు ఒక గుహాలోనికి పోయినట్లుండును. దీనిపైన విశాలమైన మంటపములతో విరాజిల్లుచున్న చక్కని ఆలయములు గలవు. అమ్మవారి పేరు కుంకుమకుంతలాంబ. ఈ ఆలయమునకు మరికొంత ఎత్తున గణేశ్వరుని ఆలయమున్నది. ఇక్కడనుండి క్రిందచూచిన తిరుచినాపల్లి పట్టణమంతయు మిక్కిలి చక్కగ కనబడును. ఇక్కడనుండి శ్రీరంగం యొక్క గాలిగోపురములు పచ్చనిచెట్ల మధ్యనుండి కనబడుచుండును. ఈ దృశ్యమంతా చాల కన్నుల పండువుగనుండును. ఇది పల్లవరాజులకాలము నాటిదని చెప్పుదురు.

తిరుచినాపల్లి దక్షిణఇండియా రైల్వేవారి ప్రధాన స్థానము. ఇది మద్రాసుకు 212 మైళ్ల దూరమున నున్నది. కావేరీనదీతీరము. రైల్వేవారు కొన్ని కోట్ల రూపాయలు వెచ్చించి రైలుబండ్లు, పెట్టెలు, ఇంజనులు వగైరా ఇనుపసామానులు చేయుటకు వర్కుషాపులను నిర్మించియున్నారు. ఈ భాగమునకు గోల్డెన్ రాక్ అని పేరు. ఈ వర్కుషాపులో దాదాపు 5 వేలమంది పనివాండ్రు పనిచేయుచుందురు. ఈవర్కుషాపు భాగమంతా ఒక పెద్దబస్తీగా కనబడును.

## మధుర

తిరుచినాపల్లినుండి మధురకు వెళ్లితిని. రైలుస్టేషను కెదురుగ జిల్లాబోర్డువారి మంగమ్మాళ్ సత్రములో బసచేసితిని. ఇక్కడ గది ఒకటింటికి నాలుగణాలవంతునను, పైగదులకు ఎనిమిదణాలవంతునను అద్దె వసూలుచేయబడును. ఈసత్రములో అన్ని వసతులు గలవు. మధుర గొప్పపట్టణము. చెన్నపట్టణము తరువాత నిదే గొప్పపట్టణము. దాదాపు 2 లక్షల జనసంఖ్య గలదు. మద్రాసునుండి మధురకు 309 మైళ్లదూరం. మధుర వైగనదీ తీరమందున్నది. ఇది పూర్వము పాండ్యరాజులు రాజ్యమేలిన దేశము. 16, 17 శతాబ్దముల క్రిందట తిరుమలనాయక్ అను రాజుల కాలములో నిక్కడనున్న దేవాలయములు రాజనగరములు నిర్మింపబడినట్లు చెప్పుదురు.

మధురపట్టణమధ్యమున మీనాక్షీదేవాలయమున్నది. మీనాక్షీ ఆలయమునకు ప్రక్కనే సుందరేశ్వరాలయమున్నది. ఈ దేవాలయములోని రాతి స్తంభములపై చెక్కబడిన విగ్రహములు, లతలు నగీషీపనుల యొక్క పనితనము హిందూదేశములో నెక్కడను గానరావు. ఈదేవాలయముచుట్టూ నాలుగు ఉన్నతములైన ప్రాకారములు గలవు. ప్రతిప్రాకారమునకు ఎత్తైన గాలిగోపురములు గలవు. ఇక్కడనున్న కోనేరు, సహస్రస్తంభమంటపము, గణేశవిగ్రహము, రాతిపై నగీషీతో చెక్కబడిన చిత్రవిచిత్ర విగ్రహములు, లతలు చూచి ఆనందింపవలసినవేగాని వ్రాయుటకు భాష చాలదు.

మీనాక్షి దేవాలయమున కెదురుగ వసంతమంటప మున్నది. దీనిని నిర్మించుటకు 22 సంవత్సరములు బట్టినదట. ఈ హాలు పొడవు 333 అడుగులు. వెడల్పు 105 అడుగులుండును. దీనిని తిరుమల నాయకరాజు కట్టించినట్లు చెప్పుదురు.

ఏప్రిల్ మాసములో జరుగు మీనాక్షీసుందరేశ్వర కళ్యాణోత్సవము చూచుటకు జనులు తండోపతండములుగ వత్తురు. ఈ ఉత్సవములు 12 దినములు జరుగును.

పట్టణమునకు ఒకటిన్నర మైలు దూరములో తెప్ప కోళం అను చెఱువున్నది. ఇది నలుచదరముగా నుండును. ఇంత పెద్దకోనేరు ఎక్కడను లేదని చెప్పుదురు. ఈ చెఱువుచుట్టూ మెట్లుగలవు. కోనేరు మధ్య చిన్న ఆలయమున్నది. నాలుగుమూలలను చిన్న గుళ్లున్నవి. ప్రతిజనవరిలోను ఉత్సవము జరుగును. ఆనాడు లక్షదీపములు కోనేరుచుట్టూ పెట్టుదురు. అప్పుడు దేవుని ఒక తెప్పమీద వేంచేపుచేసి చుట్టూ త్రిప్పుదురు. దీనికి తెప్పోత్సవమందురు.

మీనాక్షిదేవాలయము చూచువారు రాత్రి పూటనే చూడవలెను. రాత్రి ఆలయము విద్యుద్దీపములతో వలరారుచుండును. ఈ కాంతులమధ్య మీనాక్షీ అమ్మవారు దేదీప్యమానముగ ప్రకాశించు చుండును. ఆలయమంటపములలో బట్టలదుకాణ ములు, ఫల పుష్పముల అంగళ్లు, బొమ్మల దుకాణ ములు ఇవి యని ఆననేల. అన్నివిధములైన చిత్ర విచిత్ర వస్తువులన్నియు అక్కడ విక్రయింపబడును. యాత్రికులు తండోపతండములుగ దుకాణములవద్ద మూగి వస్తువులను కొనుచుందురు. మీనాక్షీ ఆల యము అనేక ద్వారములు మంటపములు వీధులతో నిండియున్నందున క్రొత్తవారు వారు పోవునమార్గ మున తిరిగిరాజాలరు. మీనాక్షిఆలయము ఒక పూరు గానుండును.

నేను వెళ్లిననాడు రమణమహాబుషియొక్క అమె రికాదేశపు శిష్యుడు రాగా ధర్మకర్తలు ఆయనకు పూలహారము వేసి గౌరవించిరి. ఆయనకు గర్భగుడి తప్ప మిగతప్రాకార మధ్యభాగములను మాత్రము చూపించి పంపిరి.

అమ్మవారిని ఉత్సవదినమున పూరేగించుటకొక పెద్దరథమున్నది. దాని క్రిందిభాగమంతయు వెండి తోను పైభాగము బంగారముతోను నిర్మింపబడినది.

మధురాపట్టణము చక్కనిపట్టణము. నగరముమధ్య దేవాలయము, దానికి నలువైపుల వీధులు. ఈవిధ ముగ పట్టణమంతయు నలుచదరముగ నిర్మింపబడి యున్నది. పరిసర ప్రదేశమంతయు మంచి ఫలవంతమై నది. కొబ్బరి, అరటి, చెఱకుతోటలు మెండుగా నున్నవి. వరికూడ పండును.

మధురనుండి రామేశ్వరమునకు పయనమైతిని. మధురనుండి రామేశ్వరమునకు అయిదున్నరగంటల ప్రయాణం. ఈ మార్గమధ్యమున మండపంక్యాంపు అనే స్టేషనున్నది. సిలోనుకువెళ్లే 3 వ, తరగతి ప్యాసెంజర్లను యిక్కడ నిలిపివేసి వారిని పరీక్ష చేయుటకు వారందినము లిక్కడవుందురు. వారికి జ్వరము మున్నగు రుగ్మతలున్నచో టీకాలువేసి సర్టిఫికెట్ యిచ్చి సిలోనుకు పంపుదురు. వీరిలో విశేషజనము కూలీలు. సెకండుక్లాసు ప్యాసెంజర్లు అయినచో ఇక్కడిఅధికార్లు వారిబండిలోనికే వెళ్లి పరీక్షచేసి సర్టిఫికెట్ యిత్తురు.

ఈ స్టేషనుతరువాత పాంబన్ అనే స్టేషనువుంది. మండపం — పాంబన్ స్టేషనులమధ్య — సముద్రము మీదకట్టిన వారధిపై రైలుపాటును. పూర్వము యిక్కడ ప్రయాణీకులు యీపాంబన్ జలసంధిని స్టీమర్లపై దాటుచుండెడివారు. ఇప్పుడు సముద్రమును రాతిబండలతోపూడ్చి దానిపై యినుప స్తంభములతో బ్రిడ్జిని కట్టినారు. పాంబనుస్టేషను ఒకజంక్షను. ఇక్కడ

నుండి గామేశ్వరమున కొక రైలుబండియు, ధనుష్కోటి కొకబండియు పోవును. రామేశ్వరము పోవువారు పాంబనులోదిగి రామేశ్వరంబండి ఎక్కుదురు. ధనుష్కోటి, సిలోనుబోవువారు చేరుగపోవుదురు.

పాంబనునుండి రామేశ్వరమునకు 11 మైళ్లు. ఈగడ్డ అడ్డముగ 6 మైళ్లు. ఈగడ్డఅంతయు ఒకలంక. పెద్ద పెద్ద యిసుకదిబ్బలు, తాటిచెట్లు, తుమ్మచెట్లు మాత్రమె యిక్కడవున్నవి. సముద్రపు నుడిగాడ్పులు కొట్టినప్పుడు యీఎత్తైన యిసుకదిబ్బలు ఏర్పడుచున్నవి. ఈ సుడిగాడ్పులవల్ల రైలుపట్టాలు సైతము యిసుకతో కప్పబడి రైలునడచుటకు ఆటంకమగుచుండును.

## రామేశ్వరము

ఇది అనాదిగడ్డ. రామాయణం నాటినుండి యీగడ్డవున్నది. సీతాదేవి యిసుకతో లింగముచేసి యిక్కడ లింగప్రతిష్ఠచేసినట్టు స్థలపురాణము చెప్పుచున్నది. దీనినిబట్టి యీగడ్డపుట్టి కొన్నిలక్షల సంవత్సరములై యుండవచ్చు ననుచున్నారు. శ్రీరాముడు సీతాన్వేషణార్థమై వచ్చి సింహళమునకు వెళ్లునప్పుడును, రావణసంహారానంతరం తిరిగి వెళ్లునప్పుడును శ్రీరాముడు రామేశ్వరములో దిగినట్లు చెప్పుదురు. బ్రాహ్మణుడగు రావణునిజంపిన పాపపరిహారార్థమై శ్రీరాముడు రామేశ్వరములో గంధమాధన పర్వతముపై లింగప్రతిష్ఠచేసినట్టు చెప్పుదురు.

రామలింగేశ్వర దేవాలయము దానిచుట్టూ ప్రాకారములు కలిసి 1000 అడుగుల పొడవును 657 అడుగుల వెడల్పును గలిగియుండును. ముఖద్వారమున నున్న గాలిగోపురము 100 అడుగుల ఎత్తుండును. లోపల ఆలయముయొక్క గోపురము 120 అడుగుల ఎత్తుండును. ఆలయములోని రాతి స్తంభములమీదను, మంటపముల కుడ్యములమీదను చెక్కబడిన నగిషిపని వర్ణింపనలవిగాదు. ఇక్కడ లింగము శ్రీరామునిచే స్వయముగ ప్రతిష్ఠింపబడినట్లు ప్రతీతి. శ్రీరాముడు కాశీనుండి లింగమును తెప్పించుటకు హనుమంతుని పంపినట్లును అతను నిశ్చయించిన ముహూర్తమునకు రానందున సీతాదేవి ఒకమృత్ లింగమును ప్రతిష్ఠించినట్లును ఒక గాథకలదు.

యాత్రికులు రామేశ్వరమువద్ద సముద్రస్నానము చేసి రామలింగేశ్వరస్వామి ఆలయములోనున్న గంగా, యమున, సూర్య, చంద్ర, చక్ర, గాయత్రీ, సావిత్రీ కోడి మున్నగు 24 కూపతీర్థములతో స్నానము చేసి రామలింగేశ్వరునకు అర్చనాదిపూజలను చేతురు. తీర్థము తెచ్చేవారు కోడితీర్థములోని జలమును తీసుకొని పాత్రలలో సీలుచేసి యిండ్లకు గొనిపోవుచుందురు.

రామేశ్వరములో జరుగు ఉత్సవములలో జూలై మాసములో ఆది అమావాస్యనాడుజరుగు ఉత్సవము మహాగొప్పది. ఈ ఉత్సవమునకు హిందూదేశములోని నలుముఖములనుండి యాత్రికులువత్తురు. ఆనాడు ధనుష్కోటివద్దనున్న సముద్రతీరమంతయు నరఅడవిగా మారిపోవును.

దక్షిణదేశములలోని దేవాలయములలో కెల్ల రామేశ్వరమందలి ఆలయమే చాలపురాతనమైనదనియు, మంచిరాతిపనితో చేయబడిన గోపురములు గలవనియు ఆనేకులు ప్రశంసించియున్నారు. రామేశ్వరములో యాత్రికులకు చక్కనివసతిగల సత్రములున్నవి. కొన్నిసత్రములలో ఒకపూట ఉచితముగ భోజనముగూడ పెట్టబడును.

రామేశ్వరమునకు మద్రాసుకు 450 మైళ్లు. దాదాపు రు 7-0-0 రైలు చార్జీవుండును.

రామేశ్వరమునకు బోయినవారందరు మార్గమధ్యమునన్నున్న రామనాధపురంలోదిగి అక్కడికి దర్భశయనం, నవపాషాణం అను పుణ్యక్షేత్రములను దర్శించెదరు.

# వాడండి !-

# జీవామృతము

రక్తవృద్ధికి ....




ఆయుర్వేదాశ్రమము-మదరాసు.

# భారతస్త్రీలు – ఆచారములు

సత్యవోలు శ్రీరామమూర్తిగారు

భరతఖండమున స్త్రీలు విద్యావతులు కారనియు, లోకవృత్తము బాగుగ నెఱింగినవారు కారనియు, నాంగ్లవేషభాషానుసరణమువలన నేడు యభివృద్ధిమార్గముల బడయుచుండిరనియు కొందరి పాశ్చాత్యుల యభిప్రాయము. ఏదేశమేని జాతీయాదర్శముల ననుసరించి యభివృద్ధిమార్గముల ననువర్తింప బ్రయత్నింపకుండినచో సంఘము బలహీనమై కాలక్రమమున నశించును. మఱియు నభివృద్ధిగాంచు విషయమున విదేశీయములైన పద్ధతుల నేదేశమనుసరించునో యాదేశము తన జాతీయతను కోల్పోవును. కావుననే పాశ్చాత్యులు ప్రాచ్యదేశీయులను వేషభాషలలో ననుసరింపరు. మనవారు పాశ్చాత్యుల వేషభాషల ననుసరించుటకు వెనుదీయరు. ఇదియే జాతీయత కాపాడువారికిని లేనివారికినిగల భేదము. జాతీయాభివృద్ధి ముఖ్యముగ స్త్రీలవలన గావలయు ననుచున్నారు. కావున తొల్లిభారత స్త్రీలెట్లు ప్రవర్తించినదియు, నేడెట్లు ప్రవర్తింపవలసియున్నదియు, వేదకాలమునుండియు భారతాంగనలాచారములెట్లు మారినవియు నెఱుంగవలసియున్నది.

కాలమునననుసరించి యాచారములు, ధర్మములు, ప్రవర్తనలు తారుమారగుట సహజము. నేడు హిందూమతధర్మముల ననుసరించి జరుగు వివాహము లానాడు ఎనిమిది విధములుగ జరుగుచుండెడివి. మనువు స్త్రీల ధర్మముల నెఱింగించుపట్టున నిరువదియొక్క సంవత్సరములు వచ్చుదనుక కన్యా నిరూపణము గావించియున్నాడు. శ్రుతికాలమునకు స్మృతికాలమునకు బూర్వము వివాహనియమము లేదు. పురుషులకు బ్రహ్మచర్యమే విధాయక ధర్మము. బ్రహ్మచర్యము నాచరింపలేని స్త్రీపురుషులు గృహస్థధర్మము ననుసరించి సంతానముబడసిన తర్వాత మరల బ్రహ్మచర్యాశ్రమమున బ్రవేశించి జాతీయధర్మములు నశింపకుండ గాపాడుచుండువారు. శ్రుతిస్మృతి పురాణకాలములనుండి స్త్రీధర్మములు కాలానుగుణ్యముగ మారినవి. కాని యెన్నడు స్త్రీ స్వాతంత్ర్యమునకు భంగముగాని, స్త్రీవిద్యకు లోపముగాని కలిగినట్లు కనబడదు. ప్రపంచమున నేదేశము గన్నుతెఱచి యెఱుంగనినాడు భారతదేశమెల్లదేశములకు నాయకమణియై సకల సౌభాగ్యములకు నిలయమైయున్నదని తెలిసికొనుట కనేక ప్రబల నిదర్శనములు గలవు. ధనుర్వేదము నభ్యసించి తమ బిడ్డలకు సమస్తవిద్యలు, సకలనీతులు ప్రబోధించి యానాటి భారతాంగనలు తమ ప్రజను మహాబలసంపన్నులజేసి పెంపొందించిరి. ఋగ్వేదములో కొంతభాగము విశ్వావర | (అత్రికులమునకు జెందినది) లోపాముద్ర (అగస్త్యునిభార్య)లచే చెప్పబడినని తెలియుచున్నది. పురాణకాలమునాడై

నను మైత్రేయి, గార్గి, తార మున్నగువారి జీవితము లాదర్శములుగ గలవు. ద్రౌపది రాజ్యపాలనావిధానమున స్త్రీలధర్మములు, హక్కులు మున్నగువాటియందు మిక్కిలి శ్రద్ధవహించినట్లు గానబడుచున్నది. కైకేయి సత్యభామ మున్నగు స్త్రీలు రణరంగమున గూడ పేరుబడసినట్లు తెలియుచున్నది. ఆనాటి స్త్రీలలో బాల్యవివాహములుగాని పరదా దురాచారముగాని ఉన్న వనుట కేమియు నిదర్శనములులేవు. పైగా స్త్రీలు వివిధ ప్రదేశములకు ప్రయాణములొనర్చి భర్తల నెన్నుకొన్నట్లుగూడ తెలియుచున్నది. అశోకుని కుమార్తెయగు సంగమిత బౌద్ధమతధర్మములను ప్రజలకు బోధించుటకై దేశదేశములు తిరిగెను. శ్రీహర్షునిసోదరియగు రాజ్యశ్రీ గొప్ప విద్యావతి. కుమారిలభట్టుని సోదరియగు సరస్వతి గొప్ప విద్వాంసురాలనియు, హిందూమత ప్రచారములో శంకరాచార్యున కెంతయో తోడ్పడినట్లును తెలియుచున్నది. పంద్రెండవ శతాబ్దమున భాస్కరాచార్యుని కుమారితయగు లీలావతి గణితాదిశాస్త్రములు రచించి యఖండఖ్యాతిని బడసెను. ఇంకను కొన్నివిషయములు జక్కగ తెలిసికొనవలెనన్న విదేశములనుండి మనదేశమునకు జూడవచ్చిన హ్యూయాన్‌త్సాంగు, మెగస్తనీసు మున్నగు యాత్రికులు రచించిన గ్రంథములు ప్రమాణములు. ఆర్యావర్తమున స్త్రీలనుగూర్చి కలనల్‌టాడు అనునాత డిట్లు వ్రాసెను. "The annals of no nation on earth record a more magnanimous instance of female loyalty than exemplified by the Rajput women." స్త్రీలు మిక్కిలి స్వతంత్రలై యుద్ధములను సైతము నడిపించెడివారనియు, పురుషులు వీరవిహారము సలుపుచుండ స్త్రీలు జయాపజయము లెట్లు వర్తించునదియు తమ బుద్ధికౌశలమున తెలిసికొని తమపురుషులకు తగిన సలహాల నొసంగుచు, మానప్రాణరక్షణార్థ మవసరమగు నెడల బురుషులతో సమానముగ వీరవిహారము సలుపుచుండెడివారనియు రాజపుత్రస్థాన చరిత్రలలో గాంచియుందుము. రణరంగమునుండి పారివచ్చినపురుషు నిల్లు చేరనీయక మరల యుద్ధమునకంపు పడతులుగూడ నాడుగలరు.

రానురాను మహమ్మదీయులు మనదేశముపై దండయాత్రకు వెడలి దేవాలయములను కొల్లగొట్టుట, సుందరాంగనల నపహరించుట మున్నగు కార్యములకు దొరకొనినదాది స్త్రీవిద్యయు, స్త్రీస్వాతంత్ర్యము నరికట్టబడినట్లు మనము గ్రహింపవలసియున్నది. నాటినుండియు బాల్యవివాహము, పరదాఆచారము ప్రబలినవి.

ఆంగ్లపరిపాలన వచ్చినప్పటినుండియు మన స్త్రీలకు విదేశనాగరకతానుసరణ మలవడుచున్నది. భాషనేర్చుకొనునంత మాత్రమున పద్ధతులనుగూడ మార్చవలెనని యభిప్రాయపడుచు విలాసజీవనమునకు లోనయి ప్రవర్తనాబలమును కోల్పోవుచున్నారు.

అఖిలభారతకాంగ్రెసును స్థాపించిన నాటి నుండియు మహిళాసంఘములు బయలు వెడలి స్త్రీస్వాతంత్ర్యముకొఱకు మిక్కిలి ప్రయత్నించుచున్నవి. బాల్యవివాహములు పరదాఆచారము లేకుండచేయుటకు పాటు పడుచున్నారు. ఈ యాచారము రాజపుత్ర స్థానమునగల హిందూస్త్రీలయందును, మహమ్మదీయ స్త్రీలయందును మిక్కుట ముగ ప్రబలియున్నది. వీరు ఇంటనుండు మగ వారిని తప్ప యితరులను కన్నెత్తిచూచుటకు హక్కు లేదు. యుక్తవయస్కులైనది మొదలు బయటకుపోవలెనన్న బురకా ధరించవలెను. గాలి, సూర్యరశ్మి వీరి జీవిత కాలమున లభించుట కవకాశములులేవు. అందుచే వారిలో క్షయ మున్నగువ్యాధు లెక్కువయి ఆరోగ్యమును కోల్పోవుచు న్నారు. ఇక విద్యావిషయమున వేరుగ చెప్పబనిలేదు. పూర్వము రాజపుత్రస్త్రీలును మొగలు జమీందారుల కుటుంబములలో స్త్రీలును నీయాచారమును పాటించినను సంగీతము, చిత్రలేఖనము మున్నగు లలితకళ లన్నియు నేర్చికొనుట కవకాశము లుండె డివి. దక్షిణదేశము, మహారాష్ట్రము, గుజరాతు దేశములం దీ యాచారము అసలేలేదని చెప్పవచ్చును. ప్రవర్తనా బలముగల స్త్రీల కీయాచార మనవసరము. లేనివారి కీ యాచారమున్నను ప్రయోజ నములేదు. గాన మహిళాసంఘము లీ దురాచారములను బారద్రోలి నేటి విద్యావిధానమున మార్పుగలిగించవలెను. నేటివిద్య స్త్రీపురుషులకు స్వతంత్ర్యజీవన వాంఛను చంపివైచి పరసేవాసక్తికిని, విలాసజీవనమునకు తోడ్పడుచున్నదని వ్యక్త మగుచున్నది. గాన ప్రవర్తనాబలము, జాతీయాదర్శములను పెంపొందించు విద్యల నభ్యసింపజేసి భారతాంగనల నభివృద్ధికి దెచ్చుటకు మహిళాసంఘములే భారము వహించవలసియున్నవి.

## బర్మా చందాదారులకు గమనిక

1937 వ సం. ఏప్రిల్ నెల మొదలు తేదీనుండి పోస్టల్ రేట్లు ఎక్కువ చేయబడినవి గాన బర్మా చందాదారులకు 'గృహలక్ష్మి' సంవత్సరము చందా 4–8–0, విడిప్రతి 0–6–0 అనియు మనవి చేయుచున్నాము.

మేనేజరు, గృహలక్ష్మి.

# ద్రోహి యెవరు?

ఇది చాలకాలంనాటి మాట. అయినా నాకు బాగా జ్ఞాపకం వుంది. అవి నాకు సంతోషదినాలు. నేనపుడు చిన్న అబ్బాయిని. మాతండ్రిగారి వెంబడే మావూరు చుట్టుప్రక్కలంతా బండిమీద తిరిగేవాణ్ణి. ఆదినం జరిగింది ఇపుడు స్పష్టంగా నాకన్నులయెదుట గనపడినట్లుంది. ఆదినం సాయంత్రం యథాప్రకారం మాతండ్రి ఒంటెద్దుబండిలో నిర్విచారంగా కూర్చొని పైలుదేరాము. ఆబండివూపులకు నాకు నిద్ర వస్తూ వస్తూవుంది. ఏగ్రామందగ్గరికి, ఎంతదూరం వెళ్లామో తెలియదు. కాని మాతండ్రి ఎద్దువదిలించి బండి నిలిపే వేళకు నాకూ మెలకువ వచ్చింది. బండికెదురుగా ఒకప్రక్కగా మాల వెంకడు నిల్చునివున్నాడు బుజాన చినిగిన దుప్పటి వేసుకొని.

"ఏమిరా వెంకా! ఏమిగావాలి" అని అడిగాడు మానాన్న.

"నా చిన్నబిడ్డ శీనుగాడు ఎనిమిదిదినాలుగా జరంవచ్చి నానా బాధపడుతున్నాడు సామీ! ఏం చేయాలో తెలియకుండా అల్లాడుతున్నాం" అంటూ దయచేసి రక్షించరూ అన్నట్లు దీనదృక్కులతో వెంకడు చూస్తూ నిలబడుకున్నాడు చేతులుకట్టుకొని.

"అయితే వకమారు బిడ్డని చూడమంటావా!" అని దయను వెల్లగక్కే కన్నులతో ప్రశ్నించాడు తిరిగి నాన్న.

"అంతమాత్రంచేస్తే మీపాదాలకాడ పడివుంటా సామీ! తెల్లవారి పట్నంలోకియెల్లి రామదాసు గారి పాదాలమీదబడి మొరెట్టుకొంటే దేవరాబిడ్డని చూడమని, వచ్చేదానికి యీల్లేదు పొమ్మన్నారు సామీ—"

వెంకడు ముగించలేదు. నాన్న బండిలోవున్న మందులసంచి తీసికొని రోడ్డుప్రక్కననే వున్న మాల గూడెంలో వెంకని పూరిగుడిశదగ్గరకు వెళ్లసాగాడు. నేనుగూడా గభాలున బండిలోనుండి క్రిందికిదూకి నాన్న వెంబడి పరిగెత్తాను. వెంకని పూరింటిముందు ఎండకు వానకు నిరాఘాటంగా త్రోవయిచ్చే పంచ వేసివుంది. అందులో వెంకడి పెళ్లాము కాబోలు, ఒకావిడ బిడ్డని చేతుల్లో ఎత్తుకొని వూపుతూవుంది. చుట్టూ నలుగురైదుగురు ఆడవాళ్లుచేరి యేమేమో మాట్లాడుకుంటూ వున్నారు.

మేము వచ్చిందిచూచి వారంతా లేచారు. వెంకడు బిడ్డను తనచేతిలోనికి తీసికొన్నాడు. తండ్రిగారు నిదానంగా పరీక్షించారు. ఎన్నో ప్రశ్నలడిగారు. ఆబిడ్డకు చైతన్యంవున్నట్టు కనపడలేదు. నా చిన్న హృదయం ఎందుచేతనో పూరక కొట్టుకో సాగింది. నాన్న అంతాపరీక్షించి "వెంకడూ! నీబిడ్డకేమీ భయంలేదు. త్వరలో బాగవుతుందిలే." అన్నారు.

ఎందుకో నా కమితసంతోషం వచ్చింది. వెంకని పెళ్ళాం "అయితే సామీ! నాబిడ్డ బతుకుతాడా!" అని ఆదుర్దాతో అడిగింది.

'భయంలేదు, ఇదో! ఈమందివ్వండి. నేను రేపు కూడా ఈదారిని వెళ్లేటపుడుచూస్తా. నాల్గురోజుల్లో గుణం గలుగుతుంది' అంటూ ఏదోమందిచ్చి బండి వద్దకు వచ్చారు. చేతులు పిసుక్కొంటూ వెంకడు గూడ బండివద్దకు వచ్చాడు. నాన్న బండెక్కాడు. వెంకడు చేతులుజోడిస్తూ 'దేవరోరు రక్షించారు. తమ కేమీ మందుకర్చుకు యిచ్చుకోలేను. నా కో పెయ్యవుంది. తమరు కొలవిస్తే తోలుకొస్తాను,' అన్నాడు.

"నాకేమీ అవసరంలేదోయ్. పిల్లవాన్ని చూచుకో శ్రద్ధగా" అంటూ ఎద్దువదిలించాడు. బండిసాగింది. ఇంతలో వెంకని యింటిపైనుండి భొయ్ భొయ్

మంటూ చిన్నకుక్కపిల్ల బండిపై పువస్తూ కనపడ్డది. ఆ తెలుపురంగూ అదీచూచేవేళకు ఎత్తుకొని ముద్దులాడా లనిపించింది నాకు. కుక్కపిల్ల నాకుగావాలనీ బండి నిలపమనీ నాన్నను బ్రతిమాలాను. ఇంతలో వెంకడు కుక్కపిల్లను నాకందిస్తూ మా నాన్నతో 'దీన్నినా చిన్నసామి కివ్వడానికి సెలవివ్వాలి' అంటూ బండిలో విడిచాడు. నాన్న ఏమీ మాటలాడలేదు. అప్పుడు నాకు కలిగినసంతోషం ఎంతో చెప్పలేను.

నా చిరుతహృదయం ఎంతో గంతులేసింది. తండ్రిగారివలెనే నేను పెరిగి పెద్దవాణ్ణయి అందరికి సాయంచేస్తే వాళ్లు అంత దయా, కృతజ్ఞతా చూపుతారేమో అనుకున్నా. నేనుకూడా నాన్నగారిలాగే మందులిచ్చేది నేర్చుకోవాలి అనుకున్నా. కాని వెంకడు చెప్పాడే రామదాసు మందులివ్వడానికి వీల్లేదన్నాడని. అదెందుకూ?

"నాన్నా! రామదాసు వచ్చి ఆబిడ్డను ఎందుకు చూడలేదు."

"మాలవాళ్లంటే ఆయన కిష్టంలేదురా! వాళ్లకు రోగాలువస్తే మనమాదిరి బాధపడతారా అనుకుంటాడేమో!"

"మనమాదిరే గద నాన్నా?"

నాన్న నావీపుతడుతూ "ఔనురా! మనవూళ్లో వాళ్లంతా మాలవాళ్లకేమి చేయకూడదు దగ్గర చేర్చకూడదంటారు. నే నేమైనా ఎప్పుడైనా చేసినా నామీద గుఱ్ఱుమని వుంటారు. కాని దేవునికి మనమెంతో వాళ్లు అంతే" అన్నారు.

"నాన్నా, నేనుకూడా పెద్దయాక నీలాగే మాలవాళ్లకి సాయంచేస్తా. మాలపిల్లలికి మందులిచ్చి బ్రతికిస్తా" అని అన్నాను. నాన్న నాముఖంలోకి చూచి చిరునవ్వునవ్వి వూరకున్నాడు.

* * *

నేను పెద్దవాణ్ణై జ్ఞానం వచ్చేకొలది మా నాన్న అమ్మాకూడ మాలమాదిగలంటే ఎంతో జాలిఅనీ బీదాసాదా అంటే సాయం ఎంతైనా చేసేవారని తెలిసికోగలిగాను. ఇదంతా చూచే ఇరుగుపొరుగూ వూళ్ళోవాళ్లకుకూడా బహిరంగంగా కాకపోయినా లోలోపల వేమంటె కోపము అసూయా అని తెలిసికొన్నా. తండ్రిగారికి మావూళ్ళోవున్న గౌరవమూ, ఆయకున్న ధనమూ, జ్ఞానమూ, పైగా వైద్యములో అమృతహస్తమూ లేకుంటే ఆయనకు జాలిగుండె వున్నందుకూ సంఘంలోని కట్టుబాట్లకు లెక్కించకుండా బీదన్నా మాలమాదిగలన్నా వారు చేసే సాయానికీ ఎప్పుడో బహిష్కారమూ అవమానమూ పొందివుండేవారే.

మాతండ్రి మాతాత కేకపుత్రుడు. ఆయన చనిపోయేటప్పుడు కావలసినంత ధనమూ జమీందారులాంటి భూవసతీ గల్పించాడు. కొంతవఱకు ఇంగ్లీషు చెప్పించాడు. మాతండ్రి తరువాత శ్రద్ధతీసుకొని వుంటే ఎంతైనా చదువుకొని పెద్దపెద్ద వుద్యోగాలు చేసివుండేవాడే. కాని ఆయనవుద్దేశం అదికాదు. అందుచేతనే వైద్యవిద్య చదివారు. అదికూడ బీదసాదల కెక్కువగా వుపయోగపడాలనే. ఆయన వుద్యోగంకూడా అదే.

* * *

దుఃఖమనేది నాపన్నెండోయేట మాతల్లి గతించిన తరువాతనే తెలిసింది. దాంతో తండ్రిగారి సంతోషం మాయమయింది. కాని నాటినుండీ నాన్న నామీద ఎక్కువశ్రద్ధ తీసుకోవడ మారంభించారు. నేనుకూడా వైద్యము చదవాలనే అభిప్రాయంతో పెంచుతూ వచ్చారు. మాయింట్లో మాతండ్రిగారు తనవిద్యార్థికాలములో సేకరించిన అస్థిపంజరముండేది. దాన్ని గురించి నాన్న నాకు శారీరశాస్త్రాన్నిగురించి బోధచేసేవారు. నాచదువుతోపాటు అదికూడా నేర్చుకున్నాను.

## ద్రోహి యెవరు?

నాన్నగారి ఆదరణచే మృత్యుముఖమునుండి బైటబడిన వెంకడిబిడ్డ, శీను, ఆయాలగూడెం మొత్తానికి అందరూ మెచ్చుకుండే అల్లరి కుర్రాడులాగ తయారయ్యాడు. అదీ కాకుండా వాడు చిన్నప్పటినుండి పిల్లంగోవి వాయించడానికి నేర్చుకుంటూ వచ్చాడు. వాడెంత అల్లరిఅయినా అంటరానివాడని అనిపించుకున్నా వేణువుచేత బట్టితే అందరూనిల్చి వినేవారు. వాడూ వాళ్ల నాయనా కూడా నాన్నగారివద్దకి వస్తూ వుండేవారు. నాన్న వానిని వేణువు వాయించమని ఎన్నోసార్లు సంతోషంగా వింటూవుండేవారు. వాడు తన తండ్రికిగాని తల్లికిగాని పనిపాటల్లో వుపయోగపడే వాడుకాడు. ఎపుడూ పిల్లంగోవి చంకలో పెట్టుకొని తిరగదిరిగేవాడు. వాన్నిచూస్తే నాకొకవిధమైన అభిమానం.

నేను మెడికల్ కాలేజిలో చేరి ఒక సంవత్సరమే అయింది. అపుడొక ఘోరం జరిగింది. మావూళ్ళో మసూచివచ్చింది. మానాన్న అపుడుచేసినసేవ నాకు మరుపురాదు. ఈ ఘోరానికి మొదట బలైనవారు శీను తలిదండ్రులు. పెద్దవాడైనా తినితిరుగుతూ తలిదండ్రులమీదనే ఆధారపడివుండే శీనుకిది అశనిపాతమైంది. నాకెంతో జాలేసింది. కాని నాగతికూడ అంతే అయింది. మానాన్న విధివిరామంలేకుండా తిరిగి రోగులను బాగుచేయడంలోనే కాలమంతా గడుపుతుండేవాడు. ఎలాగు అశ్రద్ధచేశారో వారికీ ఆ రోగంరాక తప్పిందిగాదు. తనకు దక్కకుండా అందరిని బ్రతికిస్తూవున్నందుకు కోపమువచ్చి ఆ మసూచిభూతం మానాన్ననుకూడ పొట్టబెట్టుకుంది. నాకన్నలూ తమ్ములూ లేకున్నా అమ్మానాన్నా నా ప్రపంచంఅంతా అనుకునేవాన్ని. అమ్మ పోయినప్పటినుండీ నాకేదో పోయినట్లు గనిపించేది. అందుచేత నాన్నను ఎపుడూ విడువకుండావుండేవాన్ని. అమ్మానాన్నకూడా లేనివారు ప్రపంచంలో ఏలాజీవిస్తారో నాకర్థమయేదిగాదు. వారిద్దరూమాత్రమేగాక 'నా' అనే వారెవరూ ప్రపంచంలో లేరనేటప్పటికి అథోలోకానికి క్రుంగిపోయాను. నాన్న నిజంగా పోయాడని నమ్మలేకపోయాను. ఏమిచేయాలో, ఎక్కడకి వెళ్లాలో చదవాలో మానెయ్యాలో కూడ తెలిసిందిగాదు. కావలసినంతడబ్బూ భూములూ ఇళ్ళూకలవానికి నాకేయీలా తోస్తే తిండితీర్థాలకులేక వుండడానికి యిల్లులేకుండావుండే శీనుగతి ఏమనిపించింది నాకు. నేనొకడే మావూళ్ళో, ముఖ్యంగా మాయింట్లో, వుండలేకపోయాను. అందుచేత సెలవులకు ముందుగానే బైలుదేరాను చెన్నపట్నం. నేను వూరువిడిచేముందుగా శీను జీవించేదానికి మార్గంలేక రుద్రారెడ్డి యింట్లో జీతానికి కుదిరాడనివిన్నా. ఆతని కెంతధనమూ, భూములూ, తరితరఆస్తి, పలుకుబడివున్నవో వానిలో లక్షింటపాలైనా దయాదాక్షిణ్యాలు, ధానధర్మాలు లేవు సరిగదా! బీదవాళ్లను హింసించడం ప్రతిదాన్లో నూక్ర్యాత్యం జూపడంలో స్పెషలిస్టు. మాలమాదిగలంటేనే అతనికి మంట. పనిపాటలులేకుండా తిరిగే శీనున్ని వాని వేణువునుచూస్తే అతడు మండిపడేవాడని చెప్పేవారు. అటువంటి వాడెలా ఆతనివద్ద కుదిరాడో ఎలాకాలం గడుపుతాడో అనిపించింది. మాతండ్రి బ్రతికివుంటే వానికాగతి పట్టనిచ్చివుండేవారుగాదు.

అయినా నా దుఃఖములో నా యవస్థలో ఈ విషయం నన్నంతగా బాధించలేదు. నేనుపట్నం వెళ్లిపోయాను. నాచదువు ముగించడానికి ఐదేళ్లుపట్టింది. అదెలాగో గడిచిపోయింది. ఈలోపల నాలో నొక పెద్దమార్పు కలిగింది. ధనవంతులై నావంటి విద్యార్థులతో తిరగడంవల్ల మాలమాదిగలన్నా, బీదలన్నా నాకంటె తక్కువారని నేను సాధారణులకంటె ఉన్నతస్థానంలోవున్నవాన్ననీ అహంభావం మాత్రం పూర్తిగా ఆవహించింది. మాతలిదండ్రుల అభిప్రాయాలు నాలో మరుగుపడ్డాయి. నేను మావూరువచ్చి మాతండ్రిగారిలాగే ప్రాక్టీసు ప్రారంభించాను. కాని మాతండ్రి ఆశయాల్తో గాదు.

ఒకనాటిసాయంకాలం తలవనితలంపుగా శీను నన్ను చూడడానికి వచ్చేడు. నేను వూరికివచ్చి చాలాదినాలైనా అతనిసమాచారం నాకు స్మరణకి వచ్చిందిగాదు. అతని స్థితిచూస్తే చాలాదీనంగా కనపడింది; మనిషి కూడా చిక్కిపోయాడు నన్ను చూడ్డంతోటే లేని ఉత్సాహం సంతోషం తెచ్చిపెట్టుకుంటూవున్నట్లు గనపడింది.

“ఏమిటీలా వచ్చావు?''అన్నాను అతని పరీక్షిస్తూ.

“తమ దర్శనంచేసి చాలా కాలంఅయింది. అదీ కాకుండా తమరిపుడు నాకొక సాయంచేస్తారని వచ్చాను. దయయుంచండి బాబూ!” అన్నాడు ఆ దుర్తా వెళ్లబుచ్చుతూ.

“ఏమిటో కానీ”అన్నా గంభీరంగా.

అతడు తన దీనస్థితినంతా వెళ్లగ్రక్కాడు. “బాబూ నేను రుద్రారెడ్డిగారివద్ద జీతానికి కుదిరి ఐదేండ్లయింది. ఈ కాలంలో నేనేమి బాధపడ్డానో ఎన్ని దెబ్బలుతిన్నానో దేవుడికెఱుక. ఎంతకష్టపడినా రాత్రింబగళ్లు పనిచేసినా కడుపునిండాకూడు దొరకక పోగా తిట్లు అపుడపుడూ తన్నులుకూడ భరింపనన్ని దొరుకుతున్నాయి. పిల్లంగోవంటే నాప్రాణం అని తమకు తెలుసుకదా. అదెపుడైనా ఎవరికితెలియకుండా ఒకనిముషం ఎత్తుకున్నానంటే ఇక నాస్థితి చెప్పనవసరం వుండదు. నే నాకొలువు ఎపుడెప్పుడు మానేద్దామని కాచుకొనివున్నా. తమదగ్గర కొలువుచేస్తా. మీఇష్టం వచ్చినంత యివ్వండి. నన్నుమాత్రం ఆ ఘోరనరకం నుండి తప్పించండి. నేను కొలువుమానేసి యెక్కడ పోయినా రెడ్డిగారిని తప్పించుకోలేను. తమదగ్గరుంటే ఆయన తమరినేమీ చేయలేడు. నాకు తమరీ సాయం చేస్తే ఆజన్మాంతమూ కృతజ్ఞుడుగా వుంటాను.” అని దీనంగా నావైపు చూచాడు.

“ఊహూ, నావద్దయిదివరకే ఒకమనిషివున్నాడు. నిన్ను నేనుంచుకోవడం ఎందుకు?అక్కర్లేదు''అన్నాను కఠినంగా వానిస్థితికి నాలోవున్న జాలిమేల్కొంటూవున్నా.

“దయవుంచాలి. తాము—'' అంటూ ఏదో ఆరంభించాడుకాని నేను వుతేమిచూపడంవల్ల వుపయోగంలేదనుకొని దండంపెట్టి తిన్నగా వెళ్లిపోయాడు.

మరుదినం తెల్లవారి ఏదో ఆలోచించుకుంటూ మేడమీద వరండాలోనిల్చునివున్నా. వీధిలో కత్తులు కటారులు బడితెలు పుచ్చుకొని గబగబావస్తూవున్న జనసమూహం గనపడింది. త్వరగా దిగి క్రిందికివెళ్లి వాళ్ల నడిగాను ఏమిసమాచారమని. రుద్రారెడ్డి ఆరాత్రి తన యింటివద్దనున్న తోటలోనే తలపైన పెద్దగాయముతో చచ్చిపడివున్నాడనీ శీనుమాత్రం పరారిఅయినాడనీ వాన్ని వెదకడానికి బైలుదేరామని చెప్పారు. వాళ్లంతా రుద్రారెడ్డి జీతగాళ్లు రైతులు. వాడుకనపడతే చంపాలనే వెళ్లుతున్నారు. ఆమాలకుంక అంత పనిచేశాడనడంతోటే నాకు వళ్లు మండింది. వానిపై ఎక్కడలేని కోపమువచ్చింది. ‘సరే నేనుకూడవస్తాను వెదకడానికి మీరెక్కడికి వెళుతున్నా'రన్నా వారితో. వారు సమీపంలోవుండే గుట్టలోని పొదల్లోవుంటాడనీ ఎక్కడా వెళ్లివుండడనీ అక్కడవెదకడానికి వెళ్లుతున్నామనీ చెప్పారు. నాకొకవిధమైన ఉద్రేకమూ ఆవేశమూ వచ్చాయి. ఆహంతకుని నిటారుగాచీల్చివేయాలన్నంత కోపంవచ్చింది. వారివెంట బైలుదేరాను.

గుట్టను సమీపించాము. తల కొకదిక్కున వెదకడానికి విడిపోయాము. ప్రతివాడూ చెట్టూ పుట్టా గాలించి చూస్తున్నాడు శీనుకోసరం. హత్య కేశాడనే నేరంక్రిందశీన్నుపట్టి వేటమృగములాగ ముక్కలు చేయాలని రాక్షసులవలెవారూ వాళ్లతోపాటు నేనుకూడ యుక్తాయుక్తజ్ఞానం నశించి తిరుగుతున్నామనే సమాచారం నాకు జ్ఞాపకానికి రాలేదు.

నేను ఒకటే ఆవేశంతో వెదుకుతున్నా. పొదల మధ్య పోతూవుండి ఒక కఱ్ఱతగిలి కంపల్లోబడ్డాను.

కాలు దెబ్బదగిలింది. లేచి ఇటూఅటూ చూచాను. ఆపొదలో లోపలనక్కి శీను వేణువు హృదయానికి ఆనించుకొని గ్రుడ్లుమిటకరిస్తూ కూర్చొనివున్నాడు. రేగుతూన్నకోపాన్ని కాలినొప్పి మరింత రెచ్చగొట్టింది. జింకపిల్లమీద దుమికే పెద్దపులిలాగు వక్కదూకుతో శీనుమీదికి లంఘించి గొంతుపట్టుకున్నాను. "ఓ ద్రోహీ! హంతకుడా! నీపని ముగిసింది" అని గర్జించాను. చుట్టూ వెదకుతూవుండేవాళ్లను పిలువాలని ప్రయత్నించాను. శీను నాపట్టు విడిపించుకొని కాళ్లమీద పడ్డాడు. తలపైకెత్తి కాళ్లకు చేతులు పెనవేసి "దయవుంచండి; బాబూ వాళ్లని పిలువద్దు" అని వణకుతూ కన్నీళ్లుకారుస్తూ దీనంగా మెల్లగా బ్రతిమాలాడు.

"హంతకుడవు. ద్రోహివి. నీమీదనా దయ!" అని విదళించాను.

"బాబూ! కరుణించాలి. నేను హత్యచేయలేదు. స్వసంరక్షణార్థం ప్రయత్నిస్తే అలాఅయింది. నేను చంపాలని ఎపుడూ అనుకోలేదు" అని వెక్కివెక్కి ఏడవడాని కారంభించాడు.

"ఈ బూటకాలు నేను నమ్మతాననా నీ యభిప్రాయం" అన్నా హేళనగా.

"నమ్మండి. ఇది సత్యం. ఎంతమాత్రము అబద్ధం లేదు. నిన్న సాయంకాలం తనవద్దకి వచ్చి యింటికి వెళ్లాను. ఇది రెడ్డిగారికి తెలిసిందట. నేను తోటలో వుంటే ఒక పెద్దకత్తితో వచ్చి 'నీకు ఆనంద రావుతో ఏంపని? వుండు వెధవా నీ చర్మం ఊడ దీస్తా'నంటూ మీదికి వచ్చాగ. భయమేసింది. ఆలాంటిదెబ్బ లెన్నోతిని నేను ఇదివరకే అమితంగా బాధపడ్డా. అందుచేత దగ్గరున్న ఒక యిటికరాయి తీసి ఆయనవైపు విసరాను. దాంతో మెదలకుండా క్రిందపడిపోయాడు. నాకు భయమేసింది. ఎవరన్నా చూస్తే చంపేస్తారనీ ఈలా పారివచ్చా. బాబూ మన్నించండి. మీ పాదాలేగతి" అంటూ కన్నీరు అమితంగా కారుస్తూ ఇటూఅటూ దృష్టిపారించి నావైపు చూడసాగాడు.

[ఆనందరావు శీనును రక్షిస్తాడో, వాని శత్రువుల కప్పగిస్తాడో, తుదకు వారిరువురు ఏమవుతారో వచ్చే సంచికలో చదవండి.
చ. రా.]

---

# గమనింపు

ఈమధ్య జరిగిన శ్రీ చల్లాయమ్మ స్మారకచిహ్నవ్యాసపోటీపరీక్షయందు "పతివ్రత లోకకల్యాణమున కెట్లు తోడ్పడును" అను విషయముపై వ్రాయబడిన మొత్తం 13 వ్యాసములలో యీక్రిందివా రిరువురి వ్యాసములను ప్రథమ ద్వితీయములుగా నిర్ణయింపబడినవి.

1. శ్రీమతి ముదుంబి లక్ష్మీదేవిగారు,
ఆంధ్రగీర్వాణవిద్యాపీఠం, కొవ్వూరు.
2. శ్రీమతి వేమరాజు సుశీలగారు,
శ్రీరామపురం, భీమవరం.

యీవ్యాసము మేనెల "గృహలక్ష్మి"యందు ప్రకటింపబడును.

కార్యదర్శి,
శ్రీ రవీంద్రసారస్వతసమాజం, భీమవరం.

# బెంగాలి మిఠాయి

యూరపుఖండమున నిటలీదేశమువలె భారతదేశమందు వంగరాష్ట్రము మధుర భక్ష్యములచేయుటయందు నమితఖ్యాతి గడించినది. వారి కిందుగల నేర్పితరుల కున్నట్టు గానరాదు. వంగరాష్ట్రమందు చేయబడునట్టి మిఠాయిదినుసు లితరరాష్ట్ర ములందరుదుగ నున్నవి. వంగదేశీయుల యింట మిఠాయిదినుసులులేని యేపూట యాహారమైనను కొరతగనే యెంచ బడును. పండుగ పబ్బములందలి యానం దము వివాహాదికార్యములందలి ఘనతయు, వైభవమును వారాయాసమయములందు సిద్ధపరచు వేరువేరు మిఠాయిని బట్టియే నిర్ణయింపబడును. వారు తమయింటికి వచ్చిన బంధుమిత్రాదులకు గాని అతిథులకు గాని మధురభక్ష్య మివ్వనిచో తృప్తిపడరు. వంగవాఙ్మయమున 'మాధుర్య'మను పద మున కున్నంత మర్యాద మరియొకదానికి లేదు. వీరు మిఠాయి చేయుపద్ధతులను వానిలోనున్న వివిధరకములను గమనించి 'గృహలక్ష్ములు' వాని మాధుర్యమును చవి జూచెదరుగాక.

పాలు 'జీవామృత' మనదగినదని యంద రెఱిగినదే. బెంగాలీ లిందలి యర్థమును సంపూర్ణముగ దెలిసికొని యితరులకంటె పాల నెక్కువ యుపయోగింతురు. వారు చేయు ప్రతిపదార్థమునందును పాలనుగాని పాలతోచేయబడినవానినిగాని కలుపకయుం డరు. బంగాలీమిఠాయినిగూర్చి తెలిసికొను టకమున్న వానిలో సర్వసాధారణముగ జేరుచుండు వానినిగూర్చి తెలిసికొనవగును.

## సార్ (మీగడ)

పాలనుకాచి కదలించక కొంతకాల మటులనే చల్లార నిచ్చినచో పైన మీగడ కట్టునుగదా! దీనినే వంగభాషయందు 'సార్' (Sar) అందురు. ఇది యెక్కువగా గావలసియున్న పాల నెక్కువకాలము కాచ వలసియుండును. వంగదేశీయు లెక్కువ మీగడదీయుటకు చేయుపద్ధతియిది. పాలను చాలసేపటివఱకు కాచుచుండి విడువక కలియబెట్టుచుండవలెను. గరిటెతో పైకెత్తి పోయుచుండిన మంచిది. నురుగు ఎంత వచ్చిన అంతశ్రేష్ఠము. పొంగిపోవుట కారం భించిన కొంచము నీరుజల్లవలయును. ఈ విధముగా పాలలో నర్ధభాగ మిగిరిపోవు వఱకు కాచి నాలుగైదుగంటలకాలము కదల్పక చల్లారబెట్టవలయును. లేక పొయి మీదనేయుంచి క్రమక్రమముగా మంట పూర్తిగ చల్లారిపోవునటుల చేయవలయును. ఈ విధముగ యెక్కువమీగడ దీయ వచ్చును. దీని నుపయోగించినరీతి వెన్న నెక్కువగా బంగాలీపాకములం దుపయో గింపరు. నేయిమాత్రము విరివిగవాడుదురు.

## కీరు—కోవా

వీని తరువాత నధికముగ వాడునవి 'కీరు' 'కోవా'. కీరును Condensed milk అనియు, కోవాను Dried milk అనియు జెప్పవచ్చును. కీరులో కొన్నిసమయము లందు చక్కెరచేర్తురు; కొన్నివేళలచేర్చరు. కాని కోవాయందు మాత్రము చక్కెరను గలుపరు. వారు కీరుచేయువిధమిది. ఆవు పాలను చాల చిక్కగ అగువఱకు కాచి

చక్కెర చేర్చెదరు. కాని సాధారణముగా కాచుటకుముందే చక్కెరను కలుపుచుందురు. దీనిని అరటిపండ్లతో చేర్చి తినుటయు గలదు. ఇది చక్కని యాహారము.

పాలను కీరుకువలెనే కాచి అందలి నీరంతయు నిగిరిపోవునటుల కాచిన ముద్దవలె మిగిలుభాగమే కోవా. ఇది బెంగాలీఆహార పదార్థములలో నెక్కువగా చేర్చబడుచున్నది. ఈ కీరును కోవాను చేయునపు డెక్కువ శ్రద్ధ చూపవలసిన యవసరము గలదు. ఇది చాలమంది కనుభవైకవేద్యమే. కలియబెట్టక ఎంతమాత్ర మశ్రద్ధచేసినను పాలు పొంగిపోవును. నీరు పూర్తిగా నిగిరిపోయిన తరువాత అట్లకాడతో విడువక కలియబెట్టుచునేయుండవలయును. లేకున్న మాడిపోవుట కవకాశముగలదు. పాలుపూర్తిగా యిగిరిపోయి వెన్నవలె మిగిలిన భాగమును చల్లారబెట్టవలయును. కోవా 3, 4 దినములైనను చెడదు. కొన్నిసమయములలో నింకను చాలకాలము చెడిపోకుండ నుండుటయు గలదు. దీని నితర పదార్థములతో చేర్చి యుపయోగించునపుడు వేయింతురు. కొన్ని సమయములలో వేడినీటితో నాన్చుదురు.

మిఠాయిదినుసు లన్నింటిలో దీనిని చేర్చెదరు. వారు దీని తయారుచేయు విధమిది. లోతుగనున్న పాత్రలో పాలను మరగించి, ఉడుకుచున్నపుడు నిమ్మపులుసు సందులో కొంచము కొంచమువేయుచు కలియబెట్టుదురు. వెంటనే పాలువిరిగి జున్ను ముక్కలు ముక్కలుగా వేరగను. ఎంతపాలు కెంత నిమ్మరసమనునది అనుభవమునుబట్టి తెలియవలసినదే. ఎపుడును కొంచమెక్కువగా నిమ్మరసమును సిద్ధముగా నుంచుకొని పాలు విరిగి ముక్కలగువఱకు చల్లుచు కలియబెట్టుచుండవలెను. నిమ్మరసము దొరకనిచో నిమ్మయుప్పు (Citric acid) నీటిలో గలిపి వాడనగును. పౌను పాలునకు 8 గ్రాములు నిమ్మయుప్పు చాలియుండును. ఒకపౌను పాలకు మూడు ఔన్సుల జున్నువచ్చును. ఇతర పులుపువస్తువులతో జున్ను చేయుటంత శ్రేష్ఠముగాదు. ఈరీతి పాలు గడ్డకట్టిన తరువాత గుడ్డలో వడియబోసి, రెండు గంటలకాలము పెట్టియుంచవలెను. వడియబోసిన పాలను త్రాగుట కుపయోగింపనగును. ఈ జున్ను విషయమున నొకటి గమనింపవలెను. పాలు అపుడు తీసినవిగాక చాలసేపు నిలువయుండినవైనను, పులుపు తక్కువైనను విరిగిపోయి జున్ను రాదు. ఇటుల జరిగినచో వెంటనే దించుకొని చక్కెర చేర్చి త్రాగుట కుపయోగించుకొనుట మంచిది.

కోవావలె జున్ను చాలకాలము చెడిపోకుండనుండదు. 24గంటలుండుటయు గష్టమే. అందుచే దీని నే పదార్థములందు కలుప నుద్దేశింతురో దానిని చేయుటకు రెండు మూడు గంటలకు ముందు దీనినిచేసికొనుటుత్తమము. దీని నితర పదార్థములలో వేయుటకుమున్ను నీటిని పిండివేయుదురు.

### దాహి (పెరుగు)

పెరుగునే బెంగాలీయందు దాహి యందురు. పేరబెట్టుటకుముందు పాలతో చక్కెర జేర్చి తియ్యనిపెరుగు జేయుదురు,

# ఇదివరకూ తెలియకపోతే —
# — ఇపుడు తెలిసికొనండి

## అన్నీ ఆహారముగా ఎంచుకుండేపక్షి ఏది?

నిప్పుకోడి తినేఆహారాన్ని పరీక్షిస్తే చాల వింత కలుగుతుంది. అంత పెద్దపక్షి అయినందుకు చాల మంచి ఆహారము తింటుందని మనము అనుకోవచ్చును. కాని అది త్రాళ్ల ముక్కలు, బెరడులు, రాళ్లు మొదలైనవి తింటుంది. దానికున్న ఆకలి, జీర్ణశక్తి ఏపక్షికీ లేదు. ఆకలివేసినపుడు తినేది, తిననిదిఅనే వివక్షతలేకుండా ఏదిదొరికితే దానిని కబళిస్తుంది. ఈ పక్షులను దక్షిణ ఆఫ్రికాలో మామూలుకోళ్లవలె పెంచుతూఉంటారు.

## నీళ్లు నిప్పులను ఎందుచేత ఆర్పుతాయి?

నీళ్లుపోయగానే నిప్పులు ఆరిపోతాయి. సలసల మరిగే నీళ్లుపోసినా ఆరిపోతాయి కారణమేమిటంటే గాలి ఉంటేనే గాని ఏవస్తువు మండదు. నీళ్లునిప్పులమీదపడగానే మరిగి ఆవిరి అయిపోతాయి. ఆవిరి నిప్పులచుట్టుకొని గాలిని రానివ్వదు. అందుచేత వెంటనే నిప్పులు ఆరిపోతాయి.

## కట్టెలు మండేటప్పుడు పేలడమెందుకు?

కట్టెలలో అనేకరంధ్రాలు ఉంటాయి. ఆ రంధ్రాలనిండా గాలి ఉంటుంది. ఈ కట్టెలను పొయిలో పెట్టగానే వేడికి రంధ్రాలలో గాలి విస్తరించి చోటుచాలక ఒకసారి బయటపడిపోవడానికి ప్రయత్నిస్తుంది. అందుచేత ఆరంధ్రాలచుట్టు కట్టె పగిలిపోయి శబ్దమవుతుంది.

## ధ్వనివల్ల వస్తువులు ఏలా పగులుతాయి?

ఒక గాజుసీసాను కర్రతో గట్టిగా కొట్టినట్లైతే పగిలిపోతుంది. అది పగలడానికి కంపనమే కారణము. కంపించడానికే దేనితోనైన కొట్టవలసిఉంటుంది. ధ్వని అలలవలె గాలిలో ఒకచోటనుంచి మరొక చోటికి ప్రయాణము చేస్తుంది. ఆ ప్రయాణంలో చుట్టుప్రక్కలఉండే వస్తువులకు ఈ అలలు తగిలి కంపింపజేస్తాయి. ఆవస్తువులు లోహముతో చేసిన వైనయెడల మ్రోగుతాయి. అలలు ఎక్కువగాఉంటే పల్చని పెళుసువస్తువులు పగులుతాయి. అందుచేత పెద్దపెద్దఉరుములకు పల్చనిఅద్దాలు పగిలి ముక్కలై పోతూంటాయి.

## 'షేకుహాండు' ఇచ్చుకునే ఆచారం ఎందుకు వచ్చింది?

చిరపరిచితులు గాని క్రొత్తవారుగాని కనబడగానే షేకుహాండు ఒక మర్యాదగా ఇచ్చుకుంటూ ఉండడము ఆచారమైపోయింది. ఎవరిమట్టుకు వారు ఆలోచించుకుంటే ఈ ఆచారము పుట్టుపూర్వోత్తరము ఎవరికీ తెలియదు.

పూర్వము ఎవరైనా క్రొత్తవానిని కలుసుకున్నప్పుడు వాని మంచిచెడ్డలు తెలియవు కనుక ఆయుధాలు పట్టుకునేచేతులు కలుపుకునేవారట. అల్లా కలుపుకోవడంవల్ల అపాయంలేకుండా తప్పిపోయేది. అప్పటినుంచి ఆవాడుక అలవాటయిపోయి ప్రతివాళ్లు షేకుహాండు చేస్తూన్నారు.

1. చేపలు గూళ్లు ఏలాకడతవి?
2. త్రాగుబోతుల ద్వీపం ఎక్కడుంది?
3. పక్షుల గ్రుడ్లన్నీ ఒకటేరంగుగా ఎందుకుండవు?
4. ఐదేళ్లకే పాటలువ్రాసి సంగీతకచ్చేరీలు చేసిందెవరు?
5. మోరీలెవరు? ఎక్కడుంటారు?

మొదలైనవన్నీ వచ్చేసంచికలో చదవండి



ఎలంజానందు నూతనముగా ఏర్పడిన
మహిళాసంఘ కార్యదర్శిగా నెన్నుకొనబడిన
మిసర్స్. కళ్యాణి అమ్మాళ్



మిసర్స్. బ్రిజిలాల్ నెహ్రూ



ఫ్రెంచి వైమానికురాలగు హెలెన్‌బౌకర్ స్మారకచిహ్నము



బొంబాయిపురపాలక బాలికాపాఠశాలలందలి బాలికల వ్యాయామపద్ధతి.

# తలవెంట్రుకలను నిడుపుగా, మృదువుగా సుందరముగా నుంచుకొనుటకి సులభపద్ధతి నవలంభింపుము.

విడువక స్వస్తిక శీకాయసబ్బు వాడుచున్నచో నీకుకూడ దీర్ఘములై సుందరములైన కురులుండగలవు. ఈసబ్బు తలవెంట్రుకల శుభ్రపరచుటలో నద్వితీయమైనది; కొప్పు దీర్ఘముగ పెరుగజేయును; నైగనిగ్యము కూర్చును; చుండు మాన్పును. కుంతలాభివృద్ధికి పేరుగాంచిన శీకాయ మొదలగు దినుసులతో శీకాయసబ్బు తయారుచేయబడినది.

ఇది ఒక బిళ్లగాగాని, మూడు బిళ్లలుగల పెట్టెలుగాగాని దొరుకును. ఒక్కటి యుపయోగించిననే దాని సుగుణము మీకు తెలియగలదు. దీనికి మంచివాసనగలదు స్నానాదుల కాదర్శప్రాయముగనుండును.




## ది స్వస్తిక్ ఆయిల్ మిల్స్ లిమిటెడ్,

వడాలా బొంబాయి

డిస్ట్రిబ్యూటర్లు: ది స్వస్తిక్ ఏజన్సీ, మద్రాసు - బెజవాడ స్టేషనరీ అండు ఫాన్సీమార్టు, బెజవాడ చిత్తారి రంగయ్య అండు కంపెని కాకినాడ - గ్రంధిస్వామి అండు సన్సు, విజయనగరం సిటి.

డిస్ట్రిబ్యూటర్లు ప్రతిజిల్లాయందును గలరు.

# సినీమాలోకము

## సాంఘిక చిత్రములు – 'కోడలు'

'కోడలు లేని అత్త గుణవంతురాలు' మొదలగు సామెతలు అత్తల ఔదార్యము తెలుపుటకు నిదర్శములయి నిల్చిపోయినవి. నాటికి నేటికికూడా అత్తగారు ఒకప్పుకు తానూకోడ లేలనుసంగతిమరచి కోడండ్రపై నిరంకుశాధికారమును నెరపుచు నియంత వలె యప్రతిహతమై వర్తించుచుండును. కనిపెంచి పెద్దజేసిన మాతాపితలను సోదరీ సోదరులను ఇతరబంధువులనువీడి పతియే సర్వస్వమనుకొని అత్తమామలే మాతా పితలనిదలచి అత్తగారింట కాలుబెట్టుకోడలు అత్తచే బానిసగ నెంచబడుచుండు టతి హేయము. మనసంఘమున జరుగుచుండు దుర్మార్గములలో నిదియొకటి.

సంఘదౌర్జన్యముల చక్క జేయుటకు నవీనప్రపంచములో చలనచిత్రము లెక్కువ సేవ జేయుచున్నవనుమాట నిర్వివాదాంశము. ఈయభిప్రాయముతోడనే బొంబాయి సాగరమువీటోనువారు 'కోడలు' అను టాకీని సిద్ధముచేసినట్లు దెలియుచున్నది. ఇందలి కథయంతయు కోడలుబడు కష్టముల తోడను, అత్తగారి దౌర్జన్యముతోడను నిండియున్నది. ప్రత్యక్షముగ నొకకోడలు జీవితకాలమునందంతయు పడుకష్టముల కేంద్రీకరించినరీతి చూపబడిన నీచిత్రమును జూచిన నెంతటి కఠినులైనను తమధోరణి మార్చుకొనుట కవకాశముగలుగును. ఇందలి కథ కె. ఎమ్. మున్షీగారిచే రచింప బడినది. ఈచిత్రమునందు కోడలిపాత్ర నతి నిపుణతో నిర్వహించి సబితాదేవిగారు తన కీర్తికి మెరుగుబెట్టిరని వినుచున్నాము.

ఇంతకు జెప్పవచ్చిన దేమనగా నీ'కోడలు' వంటి సాంఘికచిత్రముల నాదర్శముగాగొని తెలుగులో నన్నెని చిత్రములదీయుట కావశ్యకత గలదు. పురాణ చిత్రములు దీయుటకంటె వినికి ధనవ్యయము తక్కువై ఫలిత మెక్కువగనుండుననుమాట చిత్రముల దీయువారికి క్రొత్తవిషయముగాదు. అందుచే ఆంధ్ర దేశమున నమితముగావాడుకయందుం డెడి యిట్టి దౌర్జన్యములను గమనించి వాని నిర్మూలనోద్దేశము నాదర్శముగాబెట్టుకొని, తదుచితరీతి రసవంతమగు రచనల జేయించి చిత్రములుదీయుటకు పూనుకొనవలెను.

ఎంతసేపును పురాణకథలపై మక్కువ వీడకుండుట మారుచున్న ప్రపంచమును సంఘమునకు గలుగు నుపయోగమును సరకుగొనక యుండుటగును. ఏదేవునికథనో చిత్రవిచిత్రముగ దీసిననేగాని ప్రజలనాకర్షిం పదు డబ్బురా దనువిషయమును నమ్ముటకు

పీలుండదు. ఏ కథనైనను నిర్మాణచాతు రిని, విషయప్రాముఖ్యమునుబట్టి యాకర్ష ణీయముగ చేయనగును. అందులకు నిదర్శ నములు గావలసినచో హిందీయందు వెలు వడుచున్న సాంఘికచిత్రముల జూడనగును. మనము వారిదారి యెందుకు త్రొక్క గూడదు?

* * *

## దశావతారములు

పూనానగరమందలి సరస్వతీ సినీటోను వారిచే దీయబడుచుండిన 'దశావతార ములు' పూర్తిగావచ్చినది. ఉగాది నా డాంధ్రదేశమున పలుచోట్లలో నేకకాలమున విడుదలయగునని తెలియుచున్నది.

* * *

## భక్తతుకారాం

ఆంధ్రనటీనటులును చిత్రకారులునుకూడి నిర్మించిన "రోహిణీపిక్చర్సు" స్టుడియో భక్తతుకారామును దీయుచున్నదని తెలిపి యుంటిమి. కాని అది బాలారిష్టములందే దెబ్బతిన్నదనియు చిత్రముదీయుట నిల్చి పోయినదనియు దెలియుచున్నది.

* * *

## మోహినీరుక్మాంగద

మదరాసు నేషనల్ మూవిటోను లిమిటెడ్ వారు దీయుచున్న మోహినీ రుక్మాంగదయందు నటించునటీనటవర్గము 'సతీతులసి'యందు నటించియుండిరి. డైర క్టరగు చిత్రపు నరసింహారావుగారే ఆచిత్ర మును డైరెక్టుచేసియుండిరి. ఈ మధ్య మదరాసునందు జరిగిన ఫిలిము బొలట్లు నందు తెలుగు చిత్రములలో 'సతీతులసి' అగ్రస్థానము వహించినదట. నటీనటకులలో గగ్గయ్య రామతిలకం ప్రథమస్థానం వహిం చినారట. కావలసినన్ని అవకతవకలతో తయారైన సతీతులసిలో లోపాలను వేరుగా జూపవలసినపనిలేదు. పోనీ ఇతర తెలుగు ఫిలుములకంటె ఉత్తమమైననుగాదు. వీనిలో నటించిన గగ్గయ్య రామతిలకముగారినటనా కౌశల్యము పూర్వపు చిత్రములందెంతో దీని యందంతే. అదే గర్జనలు, అదే తర్జనలు; అదే వేషము, అదే ధోరణి. వీరి నటనా కౌశలము ఆనందముకంటె అసహ్యత పుట్టించునన్న మేలు. ఇటులున్నను ఆచిత్రము ఆ నటీనటకులు అగ్రస్థానము వహించుట ఆంధ్రుల ఔదార్యమును ప్రకటించుచున్నది. మరల వీరందరుజేరి తీయబోవుచున్న ఈ 'మోహినీరుక్మాంగద'యెంతఉన్నతస్థానము వహించునో, ఏగతిపట్టునో చూడవలసి యున్నది.

* * *

## కనకతార

దశావతారములతోబాటు సరస్వతీ టాకీసువారి రెండవ చిత్రమగు కనకతార కూడ ఉగాది నా డాంధ్రదేశమందంతటను విడుదలయగునని తెలియుచున్నది.

# పుష్పచయము

అఖిలభారతమహిళాసంఘమునకు చెందిన మదరాసు సంఘమువారి యాజమాన్యమున జరిగిన బహిరంగ సభకు శ్రీమతి సేతుపార్వతీబాయిగారు (తిరువాన్కూరు మహారాణిగారు) అధ్యక్షతవహించినపుడు ఈక్రింది విధమున మహిళామణులకు హితవొసంగిరి.

"భారతదేశమున వివిధప్రాంతములందు దేశసేవకై పాటుపడుచున్న స్త్రీల ఐకమత్యమునకు తోడ్పడి, పట్టుదలతో మాతృసేవచేయుటే అఖిలభారతమహిళాసంఘమువారి ముఖ్యోద్దేశము. క్లిష్టపరిస్థితులలో తమ వంతుపనిని తాముచేయుటే స్త్రీల విద్యుక్తధర్మము. సాంఘిక, ఆర్థిక వ్యవహారములందు స్త్రీల కొకపద్ధతి, పురుషుల కింకొకపద్ధతిలేకుండ జీవితమున వివిధవిషయములందు స్త్రీపురుషుల కొకేమాదిరిపద్ధతి ఆచరణయోగ్యమగునటుల స్త్రీలు తగుశ్రద్ధ వహింపవలెను. భారతదేశమున కంతకుజెందిన వివిధసమస్యలు అఖిలభారతమహిళాసంఘమువారు విమర్శించి కార్యవిధానము నిర్ణయించెదరు. వారి కార్యక్రమము సఫలమగునటుల వివిధమహిళాశాఖలు పట్టుదలతో పనిచేయవలసియున్నది. ఉత్సాహముతో ప్రజాసేవచేయవలెను. వైద్యము తెలిసినవారు తమసోదరీమణులకు వైద్యసహాయము చేయవలెను. ఆరోగ్యమున కనుకూలించుసలహాల నిచ్చుచుండవలెను. కాయకష్టములబడి జీవనోపాధిని సంపాదించుకొను బీదలవిషయమై తగుశ్రద్ధ వహింపవలెను. ఈ విధమగు పనులను పెక్కింటిని స్త్రీలు సాగింపగలరు. బాధ్యత వహించుటకు మనము తగినవారమని లోకమునకు వెల్లడించితిమి. ఆస్తివిషయములో వారసత్వపుహక్కులోను, తదితరవిషయములలోను నూతనఆదర్శములకు మనము తావొసంగితిమి. ఎప్పటి అవసరములనుబట్టి అప్పటికి సేవచేయుచుండవలెను. వివిధవిషయములందు స్త్రీపురుషులకు సమానబాధ్యతగలదని క్రియారూపమున చూపవలెను."

## రష్యా వివాహచట్టము

చట్టములు దేశకాలపరిస్థితుల ననుసరించియుండవలెను. వాటిననుసరించుటకు ప్రజల కనుకూలముగ నుండవలెను. వాటివలన ప్రజలకు నమ్మకమును లాభమును కలుగవలెను. రష్యాదేశపు చట్టములు ప్రజల కనుకూలముగను వాటిననుసరించుటవలన ప్రజల కమితమగు మేలును చేకూరుచున్నది మనదేశమున 'శారదా' చట్టమువలె గాదు. శారదాచట్టము అమలులోనికి వచ్చుననగనే మనదేశమున పసిబిడ్డలకు వివాహము లెన్నో జరిగినవి. అమలులోనికి వచ్చినపిదప యానాము మున్నగుప్రదేశములకు వెళ్లి పూర్వాచారము పేరిట చట్టవిరుద్ధవివాహము లెన్నో జరిపిరి. దీనికి కారణమేమి? చట్టము మన కనుకూలముగనుండక నైనపోవలెను, లేదా మనము పూర్వాచారమునే పట్టుకొని మూఢనమ్మకములో నుండవలెను. కాన శాసనపుత్రోవ వేరుగను మన నమ్మకములు వేరుగనునున్న ప్రయోజనములేదు.

రష్యాదేశస్థు లిటువంటి చట్టముల ననుసరించుచుందురు. అచట వివాహములు రెండురకములు. మొదటిది 'రిజిష్టరు' వివాహము. రెండవది 'స్వేచ్ఛావివాహము' (Free marriage). మొదటిపద్ధతిపై వివాహము చేసుకొను స్త్రీపురుషులు దానికొఱకు నియమింపబడిన అధికారివద్దకుబోయి తెలుపవలెను. అధికారి వధూవరులను ఇట్లు ప్రశ్నించును. "నీకు కాబోవు భర్త (లేక భార్య) ఆరోగ్యముగనున్నట్లు నీకు తెలుసునా?" అందులకు వా రంగీకరించినచో వివాహము రిజిష్టరగును.

స్వేచ్ఛావివాహమువిషయము ముందుగనే అధికారివద్ద రిజిస్టరుచేయించ నక్కరలేదు. వివాహమాడిన కొంతకాలమునకు తెలుపవచ్చును. రష్యాచట్టములననుసరించి స్త్రీపురుషుల కన్నివిషయములందును సమాన హక్కులు గలవు. పూర్వము అచట 15 సంవత్సరములు వచ్చుసరికే స్త్రీలకు వివాహమగుచుండెడిది. దానిచే చిన్నతనముననే సంతానముబడసి దేహారోగ్యమును, బలమును గోల్పోవుచున్నారని 18 వత్సరములు నిండువరకు స్త్రీలు వివాహమాడరాదని చట్టము విధింపబడెను. అందుచేతనే రష్యాస్త్రీలు అంగసౌష్టవము, బలముగలిగి ఆరోగ్యవతులుగనుందురు. మనదేశమున స్త్రీలు బాల్యవివాహములవలన 15 సంవత్సరముల లోపుననే సంతానముబడసి యౌవనమును గోల్పోవుచున్నారని తిరిగి చెప్ప బనిలేదు. రష్యాలో స్త్రీపురుషులలో నెవరైనను వివాహమైనపిదప రద్దుచేసుకొనవచ్చును. దానికికారణము అధికారికి తెలియపరచ నక్కరలేదు. కాని, రద్దుచేసిన దినమునుండి ఆరుమాసములవరకు భర్త భార్యకగు ఖర్చు నీయవలెను. ఆమె రోగపీడితురాలైనచో సంవత్సరపుఖర్చు నీయవలెను. ఈ రెండుపద్ధతులలో నే పద్ధతిపై వివాహమాడినను వారికి కలుగు సంతానమునకు హక్కులు సమానమే. అందువల్లనే రష్యాలో అక్రమసంతానము (Illegitimate children) లేదు. ఇతరదేశములవలెగాక సంతానవిషయములందును, వారి హక్కుల విషయమందును రష్య మంచిచట్టములను గావించెను.

## కిరీటములు : వాటి ప్రాముఖ్యము

నేటి ఆంగ్లరాజులకిరీటముల నలంకరించిన మణులను బరికించిన ప్రతివారికిని ప్రాచీనహిందూరాజులు తలపునకు రాకపోరు. సార్వభౌముని కిరీటములకు శోభయు, విలువయు దెచ్చినవి మన హిందూదేశపు వజ్రములే. మన సార్వభౌమునకు మూడురకముల కిరీటములుగలవు. మొదటిది మిక్కిలి పురాతనపుపద్ధతులపై తయారుకాబడినది. దానినే సెంటుఎడ్వర్డు కిరీటమందురు. పట్టాభిషేకసమయములం దీ కిరీటమే యుపయోగించుట ఆచారమయ్యెను. ఈకిరీటము సుమారు 7 పౌనుల బరువుండును. దీని నలంకరించిన వజ్రములు, కెంపులు చాలభాగము మన భారతదేశమునుండి గ్రహింపబడినవే. క్రీ. శ. 1649 సంవత్సరములోనే గోల్కొండనుండి చాలవజ్రములు గొంపోబడినవి.

రెండవకిరీటమునకు 'ఇంపీరియలుక్రౌను' అనెదరు. ఇది చాల అందముగనుండును. కాలము గడచు కొలది నాగరికతాపద్ధతుల ననుసరించి ఇది మారుచుండును. 1838వ సంవత్సరములో విక్టోరియా మహారాణికొరకై తయారుచేయబడిన ఇంపీరియల్ క్రౌను పంచమజార్జికొరకు మార్చి చేయబడెను. ఈకిరీటము మిక్కిలి బరువుగా నుండుటచే ముఖ్యమైన పండుగలందును, ఉత్సవములందును కొన్నినిమిషములుమాత్రమే రాజు ధరించును. ఈ కిరీటమునందు 2,783 వజ్రములు, 227 ముత్యములు, 17 నీలములు, 11 పచ్చలు, 5 కెంపులు గలవు. కిరీటపు ఎదుటిభాగమున 'బ్లాకుప్రిన్సునకెంపు' అను నొకటి సుమారు 1,5,00,000 రూప్యముల విలువచేయునది అమర్చబడినది. ఇది ప్రపంచపుకెంపులలోకెల్ల మిక్కిలి పెద్దది. దీనిని క్రీ.పూ. 1000 వ సంవత్సరమున మనదేశమునుండి గ్రహింపబడినట్లును, క్రీ. శ. 1367 వ సంవత్సరమున ఇంగ్లీషు బ్లాకుప్రిన్సుకు బహూకరింపబడినట్లును తెలియుచున్నది. నాటినుండియు ఇంగ్లీషురాజులకిరీటములకే వజ్రములే మారుచున్నవి. ఈనీలమును పలకలుగా కోయక దొరకినది దొరకినట్లేయుంచి మెఱుగుపెట్టిరి. ఇది ఎఱ్ఱగ మిక్కిలి ప్రకాశముగనుండును. మనదేశముననున్నపుడే దానిమధ్య తలవెంట్రుకలావున రంధ్రముచేయబడినది. ఇపుడీ రంధ్రము కనబడకుండ

ఆ దేవిధమగు నీలపుముక్కలచే యిరుప్రక్కల మూయబడినది. కిరీటమునకు వెనుకప్రక్కకూడ 1½ అంగుళముల పొడవును, 1 అంగుళము వ్యాసమునుగల మరొకనీలము గలదు. మరొకనీలము మధ్యభాగమున గలదు. ఈనీలము 900 సంవత్సరములక్రితమే 'ఎడ్వర్డు ది కన్ ఫెసర్'యొక్క ఉంగరమున నమర్చబడినది. ఈ రెండు నీలములను హిందూదేశపునీలములే యని తెలియుచున్నవి.

మూడవకిరీటమును 1911 వ సంవత్సరమున హిందూదేశమున పంచమజార్జి ఢిల్లీదర్బారుసమయమున తయారుచేసిరి. ఇంగ్లాండుదేశమునుండి పైరెండుకిరీటములను కదపుట యుచితము గాదని దీనిని నిచట నేచేసిరి. దీనివిలువ 10 లక్షల రూప్యములని అంచనా వేయబడెను. దీనియందు 6,170 వజ్రములును 10 నీలములును గలవు. ఇవన్నియు మనదేశపుమణులే.

మేరీరాణికిరీటము 1911 వ సంవత్సరములోనే తయారుకాబడెను. దీని నలంకరించినవాటిలో కోహినూరువజ్రము మిక్కిలి ప్రసిద్ధిగాంచినది. ఈవజ్రము 1530 వ సంవత్సరమున మొఘలుచక్రవర్తియగు బాబరుకిరీటము నలంకరించినదే. దీనిని ధరించిన రాజవంశము సకలైశ్వర్యములతో తులతూగుచుండునను నమ్మకముకూడ గలదు. దీనివిలువ 20 లక్షల రూప్యములు.

మనదేశమునుండి గ్రహింపబడిన వజ్రములే యీకిరీటములకింత శోభగల్గించినపుడు పూర్వపుహిందూరాజులకిరీటము లెంతవిలువగలవో యూహింపవలసియున్నది.

## విద్యావిధానము : మనదేశమునకును ఇంగ్లాండుదేశమునకును గల భేదము

ఇంగ్లాండుదేశమునకును మనదేశమునకును విద్యావిధానములో—అందులో బాలికలవిషయమున మిక్కిలి భేదముగలదు. ఇంగ్లాండుదేశమున బాలికలకు వారివారి అభిరుచులనుబట్టి విద్య గఱపుదురు. వారి తల్లిదండ్రు లా బాలిక లభ్యసించువిద్య వారికి తగునా తగదాయను విషయము ఉపాధ్యాయులతో చక్కగ నాలోచించి అవసరమైనచో మరొకశాఖకు మార్చెదరు. కాన యచటి బాలిక లే విద్యనభ్యసించినను పరిపూర్ణముగ నేర్చుకొనుట కవకాశముగలదు. అచటి పాఠశాలలలో పలురకముల విద్యలు పూర్తిగ నభ్యసించుట కేర్పాట్లు చేయబడెను.

మనదేశమునన్నచో అన్నిబడులందును ఒకేపద్ధతి. ఏబాలిక కేవిద్యయం దభిరుచిగలదో విచారించువారు తక్కువ. ఉపాధ్యాయులు వారి కాలము గడపుకొనుటయేగాని ఈవిషయమై విద్యార్థినుల తల్లిదండ్రులకు సలహానిచ్చువారు అరుదు. మనదేశపు పాఠశాలలందు నేర్పు విద్య జీవితమున ఉపయోగము తక్కువ. స్వతంత్రజీవనమున కేవిధముగను సహకారిగ లేకుండుట యటుండ దాస్యజీవనమునకు తోడ్పడుచున్నది. కారణమేమనగా బాలికల యభిరుచులనుబట్టి విద్య నభ్యసింపజేయకుండుట మొదటిది. ప్రతిబడియందును అసంపూర్ణమైనవిద్య నభ్యసించుటకుమాత్రమే అవకాశములుండుట రెండవది. ఆ నేర్చినవిద్య గృహపరిశ్రమల కుపయోగపడకుండుట మూడవది. ఈవిషయములలో బాలురపాఠశాలలుగూడ సమానముగ నేయున్నవి.

ఇంగ్లాండుదేశమున బాలికలకు గృహనిర్వహణమున కుపయుక్తములగు పరిశ్రమలు నేర్పుటకు ప్రత్యేక పాఠశాలలు ప్రతిచోటను గలవు. ఆయాపరిశ్రమలు స్వంతముగజేసికొను విధానములు (Practical training) పూర్తిగ నేర్పెదరు. 'Rural schools' విరివిగా కలవు. ఈవిధమగు పాఠశాలలు మనదేశమున ఎక్కడనో

పెద్దపట్టణములలో నొక్కొకటియున్నను లెక్కకురాదు. మనబాలికలను పెండటనే ఇంగ్లీషుబడులలో ప్రవేశపెట్టి ఏస్కూలుఫైనలుపరీక్షో ప్యాసుచేయించుటకు ప్రయత్నింతుము. ఈవిద్య యామె గృహనిర్వాహమున కేమైన నుపయోగపడుచున్నదా? స్వతంత్రజీవనమునకు త్రాణనిచ్చుచున్నదా? కావుననే మనదేశీయులకు దాస్యవృత్తి యలవడినది. స్వతంత్రజీవనము గడపుటకు ధైర్యములేదు. అందువలననే మనదేశపు విద్యావిధానము మార్పుజెందవలెను. ప్రతిపల్లెయందును 'Rural' పాఠశాలలు స్థాపించి 'Practical education' ఇచ్చుటకు ప్రయత్నించవలెను. చిన్నతనమునుండియు విద్యయందు ఉత్సాహము కలిగించవలెను. కట్టుబాటులోనుంచక ప్రపంచజ్ఞాన మభివృద్ధిజేయుమార్గముల నభ్యసించవలెను.

"The school walls should become transparent and children will be free to move about in the larger life of community. The spiritual life of each one of our children has to be evolved through proper early education."

## తేయాకు యుపయోగములు

తేయాకు ఆరోగ్యకరమగు పానీయముచేయుటకేగాక అనేకవిధముల ఉపయోగపడును. మాంచెస్టరు గార్డియనులో తేయాకు గృహకృత్యములందిట్లు ఉపయోగపడునని వ్రాయబడినది.

"తేయాకును కొన్నిగంటలసేపు నీటిలో నానవేయుము. అముద్దను బాగుగకలిపి చిక్కగచేయుము. ఆద్రవము వార్నీసువేసిన పెద్దులను తోముట కుపయోగించును. కర్రలను తోమినచో క్రొత్తవాటివలె యుండును. నూనెవస్త్రములు, కిటికీతలుపులు, అద్దములు శుభ్రముచేయుటకుకూడ ఇది యుపయోగించును."

"పాలబుడ్డిని శుభ్రముచేయువలెనంటే దానిలో సగమువరకు సబ్బునీళ్లతో నింపుము. పిమ్మట దానిలో ఉపయోగించిన తేయాకు పిప్పిపోసి బాగుగ కలుపుము. తర్వాత చన్నీళ్లతో కడిగివేసిన శుభ్రముగనుండును. ప్రాతగొడుగును తేయాకు నీటితో కడిగి ఎండబెట్టినచో క్రొత్తదిగ కనబడును. టస్సారు సిల్కుగుడ్డలు మున్నగునవి రంగు పోయినచో కొంచెము తేయాకురసము కలసిననీటితో ఉతికిన మామూలుగ ప్రకాశించును."

## మరణించిన కొన్ని వేల సంవత్సరములకు సమాధిప్రయత్నములు

ఈజిప్టుదేశీయుల ఆచారములు చాల వింతగనుండును. పూర్వము ఈజిప్టుదేశములోని శవములను చెడిపోకుండ ఎంతకాలమైనను భద్రపరచియుంచెడివారట. ఈ ఆచారమే పూర్వము మన భారతదేశమున గూడ గలదను నమ్మకముగలదు. భరతుడు మేనమామ యింటివద్దనుండి వచ్చువరకు దశరథునిశవము చెడిపోకుండ జాగ్రతపెట్టినట్లు తెలియుచున్నది. దానినిబట్టి కొన్ని వేలసంవత్సరములకు పూర్వమే రసాయనశాస్త్రములో మనపూర్వీకులెంత ప్రావీణ్యతగడించిరో యూహింపవలెను.

ఈజిప్టుదేశమును పాలించి మరణించిన ఫరోల దేహములు నేటికిని భద్రముగాయున్నవి. కొన్ని వేల సంవత్సరములు గడచిపోయినను ఏమాత్రమును చెక్కుచెదరలేదు. ప్రాచీన ఈజిప్టునాగరికతను పరిశోధించుటకు న్యూయార్కు నగరవాసులు కొందరు పనిచేయుచున్నారు. సేన్‌మట్ అను నొకశిల్పి సమాధిని వారుత్రవ్వి పరిశోధనలు చేసిరి. అతనిసమాధికి సమీపమున మరొకసమాధి కనుపించెనట. దానిలో ఇద్దరు వ్యక్తులున్నారు. వారతని తల్లిదండ్రులై యుండవచ్చునని నిర్ణయించిరి. ఆగోరీలపై వ్రాయబడిన అక్షరములనుబట్టి వారి చరిత్రలను తెలిసికొనగలిగిరి. అక్కడయున్న స్త్రీశవముతోబాటు ఆమెఅస్తిగూడ గలదట. వాటినిబట్టి

ఆ కాలములో స్త్రీలకు ఆస్తిపై గల స్వంతహక్కులుగూడ స్పష్టపడుచున్నవి. ఇంకను అనేక సమాధులను పరిశోధించిరి. వీటిలో మూడు వేల సంవత్సరముల వెనుక శవములతో పాటు పాతిపెట్టిన రొట్టెలు, ఖర్జూరపు పండ్లు మొదలైనవి మూకుళ్లలో దొరకినవి. కొన్నిచోట్ల ఖడ్గములు, వెండిపాత్రలుగూడ దొరకినవి.

నేడు ఈజిప్టు ప్రభుత్వమువా రా శవములను ప్రాతచోటులనుండి తొలగించి పునః సమాధిచేయుటకు ప్రయత్నించుచున్నారు. ఈ ప్రయత్నములలో వారిదేశమున కీడో ముప్పోగలుగునని కొందరు భయపడుచున్నారు. గీజాఅను ప్రదేశమున ఈ ప్రతిమలను భద్రముగా నుంచుటకు శీతోష్ణస్థితిబాగుగనున్నదని అక్కడనే గోరీలను కట్టించుటకు నిర్ణయించినట్లు తెలియుచున్నది. పురాతన ఐగుప్తదేశీయులు చేసినట్లే భూగర్భములో నొకగోరీని కట్టించి పూర్వపురాజుల శవములకు అంత్యక్రియలు జరిపించి ఈ ఫరోలను శాశ్వతముగ సమాధి చేయుదురట. ఒక రాజవంశము మరణించిన కొన్ని వేల సంవత్సరముల తర్వాత ఆకుటుంబమునంతను కలిపి ఒకసారి మహావైభవముతో అంత్యక్రియలు జరుపుటకిదే ప్రథమపర్యాయమగును. ఈజిప్టుదేశపు ప్రజల కీమహా దృశ్యము లభించును.

ఈ ఫరోలందరిలోను టూటన్‌ఖామెను అనునది ముఖ్యమైనది. కొన్ని సామాన్యఫరోలను మ్యూజియములలో నుంచిరి. టూటన్ శవము రత్నములుపొదిగిన బంగారుపెట్టెలో దొరకెనట. అతనిశరీరము నిండుగ నగలున్నవి. ఆకాలపురాజచిహ్నములగు కోటికర్ర, బడితె ఆయనచేతులలో గలవట. శాస్త్రపరిశోధనల వలన దుర్భేద్యమైన సమాధిని వారికొరకు తయారుచేయుటకు ప్రయత్నించుచున్నారు.

ఆహారపుకొలత

జీవితకాలములో ఒక్కొక్కరెంతెంత ఆహారమును తినెదరో తెలుపుటకు అమెరికా, జర్మనీదేశముల పరిశోధకులు లెక్క తయారుచేసిరి.

డెబ్బదేండ్లలో ఒకమనుష్యుడు 400,000 లగాయతు 500,000 ల పౌనుల ఆహారమును తినునట. వాటిలో 12000 పౌనులు గ్రుడ్లు, 340 హండ్రడ్‌వైటులమాంసము, నూరు హండ్రడ్‌వైటులు చేపలు, 600 హం. వైటుల బంగాళాదుంపలు తినును. ఇక పానీయముల విషయమున 500,000 పింట్ల నీరునున్నగు ద్రవపదార్థములను త్రాగును. నిముషమునకు 17 ఘనపు మీటర్లగాలివంతున లెక్కవేసి 5000000 ఘనపు గజములగాలి పీల్చునని తెలిపిరి.

---

అనుకూలదాంపత్యమున కొకసూత్రము

దాంపత్య మన్నివిధముల అనుకూలంగా ఉండాలంటే ఈ క్రిందిసూత్రము ప్రకారము పెండ్లిచేసుకోవాలని అంటాడు ఒక గణితశాస్త్రజ్ఞుడు.

$$\frac{H}{2} + 7 = W$$

అంటే భర్తవయస్సును రెండుచేతభాగించి దానికి ఏడుకలుపగా వచ్చిన సంఖ్యకు భార్యవయస్సు సరిపోతే దాంపత్యం అన్యోన్యముగా ఉంటుందిట.

# గ్రంథ పరిచయము

## శ్రీమద్వానరపురాణము (స్వర్ణఖండము)

గ్రంథకర్త కావ్యకళాకోవిద గుంటూరు సీతారామదీక్షితులు, ఎల్లమంచిలి. ఇది ఎనిమిదాశ్వాసముల గ్రంథము. 'ఇందలి కథాసందర్భ మొక ప్రత్యేకకథ గాక మానవజాతి చారిత్రమునందలి వేరువేరు ఘట్టములను జూపునదై యున్నది. దీనిని ప్రస్తుతవైజ్ఞానికదృష్టితో జూచిన దీని హృదయము విస్పష్టము కాగలదు.' పురాణపద్ధతిని ప్రాచ్యపాశ్చాత్యసమ్మేళనాదృష్టితో రచింపబడిన నీ గ్రంథము నూతనసృష్టియని జెప్పవలసి యున్నది. ఇది ప్రబంధధోరణిలోనున్నది. కవిత్వము ధారాళమై సరసముగనున్నది. క్రౌను సైజు 184 పుటలు. వెల 0-12-0 ప్రతులు గ్రంథకర్తగారివద్ద దొరకును.

* * * *

## పారిభాషికపదకోశము

ప్రసిద్ధిజెందిన యేయితరసారస్వతమునకును హిందూసారస్వతము దీసిపోకున్నను, పాశ్చాత్యసాహిత్యము లందువలె సారస్వతోపయుక్తమై యెల్లరకుపయోగించు పదకోశములం దరుదు. ఉన్నవైనను సులభగ్రాహ్యములుగావు. సంస్కృతము దెలిసినవారలకుమాత్ర ముపకరించునవి. పాశ్చాత్యవిద్యావిధానమున నింతకుమున్ను నిగూఢముగనుండిన మనశాస్త్రములనే ఆంగ్లభాషలో నందరికి నేర్పబడుచున్నందున నాభాషలోనే వివిధశాస్త్రములకుసంబంధించిన పారిభాషికపదములు వాడుకలోనికివచ్చినవి. అట్టి శాస్త్రములుగాని పదములుగాని మన సారస్వతమునందున్నవా యను శంకకది తావొసగినది. ఇట్టిగ్రంథము లా శంకలను నిర్మూలించి భారతీయులసారస్వత మంతటి దారిద్ర్యదశ కెపుడును పాల్పడియుండ లేదనుటకు నిదర్శనములగును. ఇది భావిభారతీయ విద్యావిధానమున కెక్కుడుగ నుపకరించుగ్రంథము. ఆంధ్రభాషలో నిట్టిగ్రంథములు ప్రకటింప శ్రమపడిన శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుగారును, ఈగ్రంథమున నోర్పుతో పలుశాస్త్రముల పరిశోధించి పదజాలమును కూర్చిన శ్రీయుత తిరుమలరంగాచార్యులుగారును శ్లాఘనీయులు.

ఈగ్రంథమున శారీరక, జ్యోతిష, వృక్ష, రసాయన, భూగోళ, న్యాయ, గణిత, వైద్య, వేదాంత, భౌతిక, దేహధర్మ, రాజనీతి, జంతు శాస్త్రములకును, లలితకళలు, వ్యాకరణములకును సంబంధించిన ఆంగ్ల పారిభాషికపదము లకారాదిగా వానికి సరియగు నాంధ్రపదములతో వ్రాయబడినవి. పదములలో సంస్కృత పదముల నెక్కువగా వాడినటుల తోచుచున్నది. ఈగ్రంథము ప్రతివిద్యావంతునికి నత్యంతోపయోగమని జెప్పవగును. ఆంధ్రు లీగ్రంథము నాదరించెదరని నమ్ముచున్నాము. ఇది ఆంధ్రగ్రంథమాలలో 27 వదిగా వెలువడినది. డెమ్మీ 1/8 250 పుటలు. వెల రు. 1-8-0. ఆంధ్రపత్రికాలయమున దొరకును.

* * * *

## లోకబాంధవోపాసన

ఇది జోశ్యుల శ్రీరామమూర్తిగారిచే రచింపబడినది. వెల 0-4-0.

మానవుడు శారీరకమానసికారోగ్యము లాకేవిధానమువలన నతిసులభముగాబొందుటకు భారతీయులు వేలకొలది సంవత్సరములక్రిందనే యెన్నోవిధానముల గనిపెట్టియుండిరి. వారిలో నాబాలగోపాల మభ్యసింపదగినదియు నత్యుపయుక్తమునగు సూర్యనమస్కారపద్ధతియొకటి. ఈ చిన్నపుస్తకమందు సూర్యనమస్కారములను జేయుపద్ధతి, ఫలితములతో, పటములతోగూడ వివరింపబడినది. వీనితో కొన్నియోగాసనములుకూడ చేర్చబడినవి. ధనవ్యయముగాని ఇతరకష్టములుగాని లేకుండ నారోగ్యమును బొందగోరువారికిది యుపయోగకరము. ప్రతులకు వి. కామేశ్వరరావుగారు, ఫోటోగ్రాఫర్, గొడుగుపేట, మచిలీపట్నం వ్రాయనగును.

* * * *

### లలితకథానిధి

ఇందు 11 కథలుగలవు. ఇవి యింతకుముందు కొన్నిపత్రికలందు ప్రకటింపబడియుండినవే. వీనిని రచియించిన రాయసము వెంకటశివుడుగారు, (ఎం.ఏ.ఎల్.టి) ఆంధ్రపాఠకలోకమునకు నూతనముగారు. ఆధునికాదర్శములనుబట్టియు చిన్నకథ లిటుండవలయు నిర్వచనములబట్టియు బరీక్షించిన నిల్చుగ్రంథములు స్వల్పము. సాధారణదృష్టికివి చక్కని కథలనవచ్చును. శైలి సరళమై, రచన చక్కగ సాగియున్నందున బాలబాలికలకు విద్యార్థులకు ఇది యుపయోగకరముగనుండునని చెప్పవగును. వారికి ప్రపంచజ్ఞానము గలిగించుటకెంతయు నుపయోగపడును. వెల 0-8-0. గ్రంథకర్తగారివద్ద గుంటూరునందు దొరకును.

* * * *

### అస్పృశ్యుల విజ్ఞప్తి

ఇది సాహిత్యోద్యానమునందలి ద్వితీయ స్తబకము. కర్ణవీర నాగేశ్వరరావుగారిచే రచింపబడినది. కాలదేశపాత్రల ననుసరించి మన సారస్వతోద్యానమున నిట్టిపువ్వులు పూయుచుండుట ముదావహము. సత్ఫలములను గూడ నొసగునని యాశింతుము. పుస్తకమున హరిజనుల దీనస్థితియు, వారి నగ్రవర్ణు లున్నతస్థితికి దీసికొనిరావలనబాధ్యతయు సరసముగ గీతములలో చిత్రింపబడినది. వెల 0-2-0. గ్రంథకర్తగారివద్ద చీరాలలో దొరకును.

* * * *

### మహర్షియు తత్సందేశమును

మనదేశము మహర్షులకును, మహాత్ములకును, అనాదినుండియు నాటపట్టైయుది. భౌతికదృష్టిలో భారతదేశము పాశ్చాత్యదేశములకు వెనుకబడి వారికి లోబడియున్నను ఆధ్యాత్మికౌన్నత్యము ఎప్పటికిని నిలువబెట్టుకొనును. పాశ్చాత్యులసహవాసముచే భారతీయుల కాత్మబలము పెడసందేహముగలిగి ఆత్మనిరసనకు దిరిగి రెంటికిం జెడిన రేవడులగుట తటస్థించినది. కాని పూర్వమునందువలెనే పాశ్చాత్యులు భారతీయుల యాధ్యాత్మికౌన్నత్యమును గనిపెట్టి యింతదూరమువచ్చి సందేశముల గొనిపోవుచున్నారు. శతాబ్దముల నుండియు మనకు చక్కగ దెలిసియున్నవిషయమునైన పాశ్చాత్యులుమంచిదని సర్టిఫైచేయువఱకు మనమద్దానిని నిరసించుచుండుటయు, తదనంతరము దానినే శ్లాఘించుటయు జరుగుచున్నది. రమణమహర్షిచరితయు నట్టిదే యని యనదగును.

## గ్రంథపరిచయము

వారు తిరువణ్ణామలైయందున్న సుప్రసిద్ధయోగీశ్వరులు. వారు బాల్యకాలమునందే యిహలోకచింతలను వీడి పరతత్త్వమును సంపూర్ణముగ నెఱింగిన మహర్షిపుంగవులు. పెక్కుమంది పాశ్చాత్యులు వారి మాహాత్మ్యమును విని వారివద్ద కేతెంచి తమ కితరులవలన నెఱుగరాని తత్త్వరహస్యముల నెన్నింటినో సులభముగ నెఱింగి యతని మహాత్మునిగా ప్రకటించినతరువాతనే భారతీయులదృష్టి యావంకకు మరలినది. ఇట్టి పాశ్చాత్యులలో పాల్ బ్రంటన్ గారొకరు. వీరు పెక్కు దేశములుదిరిగి పెక్కుమందినిదర్శించి తమను కలవరపెట్టుచున్న పలు విధములగు తత్త్వజ్ఞానసంబంధమగు ప్రశ్నలకు తగిన ప్రత్యుత్తరములను శ్రీరమణమహర్షిగారివద్దపొంది యా సమాచారమును వెల్లడించుచు పెక్కుగ్రంథముల రచించినవారు. వానిలో మహర్షియు తత్సందేశమును (Maharshi and his message) అను ఆంగ్లగ్రంథమును దోమా వెంకటసామి గుప్తగారు తెనుగున రచించిరి. దీనితో మహర్షిగారే రచించిన 'శ్రీమదరుణాచలాష్టక'మను తమిళపద్యములకు తెనుగుపద్యములు చేర్పబడినవి. ఈగ్రంథమున బ్రంటనుగారు మహర్షిని దర్శించుటయు, తనప్రశ్నలకు తగినసమాధానమందుటయు, విపులముగ మనోహరముగ వర్ణింపబడినది. ఆంధ్రీకరణము చక్కగనున్నది. దీనిని శ్రీనిరంజనస్వామి, రమణాశ్రమము, తిరువణ్ణామలవారు ప్రకటించిరి. ప్రతులు వారివద్దనే దొరకగలవు.

---

## వ్యాసకర్తలకు

గృహలక్ష్మికి వ్యాసములు వ్రాయువారు కొంచెము మార్జినువదలి కాగితమున కొకప్రక్కమాత్రమే సిరాతో విడివిడిగా వ్రాయవలెను.
వ్యాసములనుగూర్చి ఉత్తరప్రత్యుత్తరములు గోరువారు రిప్లైకార్డు వ్రాయవలయును.

వ్యాసములు వాపసుకోరువారు తపాలాబిళ్లలను పంపవలయును.
వ్రాయు ప్రతిలేఖయందును పూర్తిచిరునామా వ్రాయవలయును.
వ్యాసములు వ్యావహారికము లేక గ్రాంథికభాషయందుండవచ్చును. రెండింటినికలిపి వ్రాసిన అంగీకరింపబడవు.

సంపాదకుడు.

శ్రీయుత జ. కె. మంగరాజుగారిచే పూనా సరస్వతీసినీటోనులో తయారు చేయబడిన బ్రహ్మాండమగు తెలుగుటాకీ

# దశావతారములు

వ్యయమా!

రు. 2,00,000 లు

ప్రయాసా?

2 సంవత్సరములు

అభినేతలా!

1000 పైచిలుకూర్చిన

ప్రదీప్తతారలు

సెట్టింగులా!

ఎన్నడూ కనివిని ఎరుంగ

నివి. బ్రహ్మాండమైనవి




గానమా!

అమృతవాహిని

ఉజ్వలతారలు!

పారుపల్లి సత్యనారాయణ

దొమ్మేటి సత్యనారాయణ

జి. యస్. స్వామి

నగరాజకుమారి

రాజకుమారి

డైరక్టరు

యం. వి. రమణమూర్తి

మ్యూజికల్ డైరక్టరు

వి. జె. గోపాలసింగు

త్వరలో సకలాంధ్రదేశమును ఆనందాబ్ధిలో నోలలాడింప విడుదలగును.

బుక్కింగుకొరకు :

క్వాలిటీ పిక్చర్సు, బెజవాడ.

# ప్రసవకాలమును దెలుపు పట్టిక.

సాధారణముగ స్త్రీలు గర్భము ధరించిన 280 దినములకు ప్రసవించెదరు. కడపటి బహిష్టయైన మొదటిదినము మొదలు లెక్క పెట్టుకొన వలయును. క్రిందకనుబరచిన పట్టిక మొదటిపంక్తి జనవరి 1.వ తారీఖున గర్భము ధరించినయెడల రెండవపంక్తి అక్టోబరు 8-వ తారీఖున ప్రసవించెదరు.

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జనవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జనవరి |
| అక్టోబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | నవంబరు |
| ఫిబ్రవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | | | | ఫిబ్రవరి |
| నవంబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | | | | డిసంబరు |
| మార్చి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మార్చి |
| డిసంబరు | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 33 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | జనవరి |
| ఏప్రెల్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | ఏప్రెలు |
| జనవరి | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | | ఫిబ్రవరి |
| మే | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మే |
| ఫిబ్రవరి | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మార్చి |
| జూన్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | జూన్ |
| మార్చి | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | ఏప్రెలు |
| జూలై | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జూలై |
| ఏప్రెల్ | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 23 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మే |
| ఆగష్టు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | ఆగష్టు |
| మే | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | జూన్ |
| సెప్టెంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | సెప్టెంబరు |
| జూన్ | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | | జూలై |
| అక్టోబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | అక్టోబరు |
| జూలై | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | ఆగష్టు |
| నవంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | నవంబరు |
| ఆగష్టు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | సెప్టెంబరు |
| డిసంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | డిసంబరు |
| సెప్టెంబరు | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 7 | 6 | అక్టోబరు |




## ఉగాది

1937

ఈమాసము పన్నెండవ తేది ధాతసంవత్సరము ముగిసి యీశ్వరసంవత్సర మారంభమగుచున్నది. నూతనసంవత్సరమునం దెల్లవారును సర్వసౌఖ్యములను గల్గియుందురు గాక యని గృహలక్ష్మి యాశించుచున్నది.

ధాతసంవత్సరము హిందూదేశమున - దక్షిణభారతదేశముననే గానిండు - నొకవిధమగు కళంకము నాపాదించుకొన్నది. ఇది యరువదిసంవత్సరముల కొకమారు దయచేసినను పూర్వము తనకాలమున నాంధ్రదేశమున జరిగినక్షామము లాది యరిష్టముల నింతవఱకు మరువకుండ జేసినది. అందుచే గతసంవత్సరము ధాతప్రారంభించుచున్నదనగా భయపడినవారు లేకపోలేదు. ఈధాతయట్టికళంకమునుండి దూరమగుటకు ప్రయత్నింపలేదు సరిగదా మరింత బలపరచినది. ఈసంవత్సరములో నాంధ్రదేశమున భీభత్సరూపము వహించినతుపాను మరొకధాతవచ్చువఱకు జ్ఞాపకముండునటుల జేసినది.

ఆంధ్రదేశముమా టటుంచినను ప్రపంచపరిస్థితులులేమియు బాగుపడినటులలేదు. క్రమక్రమముగా పరిణతిజెందిన నాగరికత అడ్డుదిరిగి ప్రవహింపబోవునటులున్నది. మానవుడు తన ప్రతిభావిశేషముచే విజ్ఞానముచే నార్జించుకొన్న పరికరములను పద్ధతులను అభివృద్ధికిగాక, నాశనమున కుపయోగించుచున్నాడు. సర్వమానవ సౌభ్రాతృతపై ప్రజలహక్కులొకవంక స్థిరపడుచుండ మరొకవంక నిరంకుశత్వము బలపడుచున్నది. ప్రజలే బిడ్డలుగా నెంచి పాటుబడుటకై ప్రయత్నించు ప్రభువులొకవంక స్వార్థపరులగు వారిచే పదచ్యుతులగుచుండ ప్రజాసామ్యముల సణగద్రొక్కు ప్రజ్ఞాశాలురొకవంక తోడ్పాటుబొందుచున్నారు. నిరపరాధురాలగునబిసీనియా అన్యాయమునకుబలియైనది. నిరంకుశత్వమును తుదముట్టింప బ్రయత్నించిన స్పెయిను పీనుగపెంటలతో నిండియున్నది. ప్రపంచమునందంతయు శాంతిప్రయత్నములకు బదులు సమరప్రయత్నము లెక్కువజరుగుచున్నవి.

సత్వరజస్తమోగుణములలో సత్వగుణప్రధానుడగు నీ ధాత — పేరు సామ్యమును బట్టిమాత్రము — యే యింత నిష్కరుణుడై ప్రపంచమునింత తల్లక్రిందుల చేయుచున్నచో తమోగుణయుతమగు 'ఈశ్వర'త్వ మేమి చేయునోయని సందియముగలుగుచున్నది. కాని పూర్వము యీశ్వరుడే యెల్లరికిస్వల్పకాలములో కోరికలదీర్చి సకల సంపదలిచ్చి

శంకరుడనునామమువహింపకపోలేదు. కావున ఈశ్వరుడు దయయుంచి యీశ్వరాబ్దమున ప్రపంచమంతయు శాంతిసౌఖ్యములందు నోలలాడు రీతి ననుగ్రహించుగాక.

* * *

### శాసనసభ్యత్వము - స్త్రీలు

గతఎన్నికలలో విజయమందిన సభ్యురాండ్రనుగూర్చియు, వారియెడ కొందరికిగల సంకుచితాభిప్రాయములనుగూర్చియు వేరొకచో వ్రాసితిమి. సంకుచితాభిప్రాయములు వెల్లడించుపురుషులు విద్యావంతులయ్యు చిత్తసంస్కారములేనివారనియో, అసూయాపరులనియో నేదో యొక విధముగ సరిపెట్టుకొనవచ్చును; లేక స్త్రీలనుగూర్చి వారు గ్రహించుటకు దేవుడు వారి కనుగ్రహించిన జ్ఞానమంతియే యని యనుకొనవచ్చును. కాని ప్రజలకు మార్గదర్శకములై, దేశాభ్యుదయమునుగోరి పాటుపడు బొంబే క్రానికల్ (Bombay Chronicle) వంటి సుప్రసిద్ధ పత్రికలు నూతనముగా నెన్నుకొనబడిన శాసనసభ్యురాండ్రనుగూర్చి తమ సంకుచితాభిప్రాయమును వెల్లడించినచో నేమన వలయునో తెలియకున్నది. ఈపత్రికలో నొకచో "ఢిల్లీఅఖిలభారతకాంగ్రెసు సమావేశములోమాటాడుచునొకనూతనశాసనసభ్యురాలు 'స్త్రీలు శాసనసభలందు తాముచేయ వలసిన దానిని మాటలచేగాక కార్యరూపమున జూప నుద్దేశించి ప్రవేశించితి'మన్నట్లు చెప్పబడినది. ఇది సకాలములో నొసగిన హెచ్చరిక. శాసనసభాధికారులు స్త్రీసభ్యులులోనికి చీపురుకట్ట, కుండలు, పెనములు గొనిపోకుండురీతి చూచెదరుగాక యని యాశించుచున్నాము." * అని వ్రాసియున్నారు. ఇట్టి వ్రాతలు సాధారణ జ్ఞానముగల యేవ్యక్తికైన యవమానము గలిగించుననుచో ప్రసిద్ధపత్రికల కెట్టి కళంకప్రాయములో సహృదయులెఱుంగకపోరు. ఒకవేళ వీరికి వారియెడ నొకవిధమగు యసూయయుండిన నుండుగాక. వారిమాటల కీవిధముగ నపార్థముల గలిగించి 'వెక్కిరింపబోయి బోల్తాపడుటెందులకు'? ఇట్టివ్రాతలను నిదివఱకెన్నియో మారులు నిరసించిన యీపత్రిక తానే యిట్టి వ్రాతల కడమిచ్చుట మిగుల విచారకరమగువిషయము. ఇకనైననిట్టి హేయమగు వానికి చోటివ్వకుండునని తలంచుచున్నాము.

### కాంగ్రెసు - మంత్రిపదవులు

నూతనరాజ్యాంగ సంస్కరణములు భారతీయులు మొరపెట్టుచున్న స్వాతంత్ర్యములో నే శతాంశమైనను యిచ్చుట

---

*"Speaking at the National Convention, one of our woman legislators is reported to have said something to the effect that women have gone to the legislatures to justify themselves by action not by words.

This is a timely warning. We hope that those responsible will see that no broomsticks, pots and pans are allowed inside the Council Chamber."

—Bombay Chronicle 23-3-37.

## సంపాదకీయములు

లేదనియు, వానియందు మంత్రిపదవులను స్వీకరించుట అధికారములేక బాధ్యత మాత్రము తలపై నిడికొనుట యగుననియు నందుచే నిరుపయోగమైన పదవీస్వీకరణము వంక దృష్టిపరుపక సంస్కరణముల ప్రతిఘటింప యావద్భారతదేశమంతయు పట్టుదలతోనున్నదని జూపుటకు మాత్రము కాంగ్రెసు శాసనసభా ప్రవేశము జేయవలయుననియు, అఖిలభారత కాంగ్రెసు హృదయము. ఈ యుద్దేశముతోడనే పదవీస్వీకరణ సమస్యను నిలిపియుంచిరి. కాని సి. రాజగోపాలాచారి ప్రభృతులవంటి కాంగ్రెసు నేతలే పదవీవ్యామోహమును వీడజాలక పదవులను స్వీకరించి సంస్కరణములను ప్రతిఘటించవలయునని ఘోషించుచుండుటచే దేశమునందు సంచలనమెక్కువై పదవీస్వీకరణ వ్యామోహము వ్యాపించినది. అఖిలభారతీయులమైకమత్యమత్యవసరముగ గావలసియున్న నీసమయమున నిరుపయోగమైన యీ సమస్యకై తమలోదాము భేదపడు టుచితముగాదని యధ్యక్షులగు నెహ్రూ మొదలగు వారఖిల భారతీయ సమావేశమును ఢిల్లీయందుగూర్చి యందావిషయమును చర్చించిరి. సంస్కరణములందు గవర్నరుల కొసంగబడిన ప్రత్యేకాధికారముల వారుపయోగింపమని యభయమిచ్చుచో మంత్రిపదవు లంగీకరింపవచ్చునని తీర్మానించిరి. ఈ తీర్మానము పదవీవ్యామోహమున బడియుండు వారి కన్నీటిని తుడుచుటకు మాత్రమని నాయకులెఱిగియుండిరేమో? ఏలన ఆ యారాష్ట్రముల గవర్నరులు తమ ప్రత్యేకాధికారము మంత్రుల యభీష్టములకు వ్యతిరేకముగ నుపయోగింపమని యభయమిచ్చుట కంగీకరింతురని నాటికి నేటి కెవ్వరు తలంపలేదు.

ఈ తీర్మానానంతరము కాంగ్రెసు మెజారిటీగల రాష్ట్రములందు గవర్నరులకును, కాంగ్రెసునాయకులకు సంభాషణలు జరిగినవి. అనుకున్నరీతిగనే గవర్నరులు అఖిల భారత కాంగ్రెసుకమిటీ నిర్ణయప్రకారమభయమివ్వమని నిరాకరించిరి. పదవుల వ్యామోహమున బడియుండువారికిదక్క దేశీయనేత లందరికిది సంతసముగూర్చినది. ఇప్పుడైన పదవుల వ్యామోహమునుండి తేరుకొని యెల్లరు కాంగ్రెసుఆశయములను కార్యక్రమమును కొనసాగించుట లెస్స. సంస్కరణములందలి నిరుపయోగమును గుర్తించిన సర్. ఎస్. క్రిప్స్ వంటి బ్రిటీషు ప్రముఖులుకూడ పదవు లంగీకరించుటకంటె కాంగ్రెసు కపాయకరమైనది వేరొండు లేదనియు సంస్కరణముల పట్టుదలతో ప్రతిఘటించుటయే యుత్తమనియు వాకొనుచున్నారు. ఇపుడు అభయనిరాకరణము Blessing in disguise అయి భారతీయులందరేకమగుటకు మంచిమార్గమునుఅవకాశమును జూపినది. దానిని సక్రమమార్గమున నుపయోగించుటయందే భారతీయుల ప్రజ్ఞావిశేషము లిమిడియున్నవి.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

1937 సం॥ ఏప్రల్ నెల ధాతు సం॥ ఫాల్గుణం ఈశ్వర సం॥ చైత్రము

| | | | | |
|---|---|---|---|---|
| | 1 | | 19 | గు॥ పం 24-28, అనూ 14-20, రా 0-45 |
| | 2 | | 20 | శు॥ ష 30-51, జ్యే 22-53, రా 14-46 |
| | 3 | | 21 | శ॥ స 36-1, మూల 29-37, ది 15-10, రా 25-14 |
| | 4 | | 22 | ఆ॥ అ 39-38, పూషా 34-47, ది 25-28, సీతాదేవివ్రతం |
| | 5 | | 23 | సో॥ న 41-18, ఉషా 38-6, రా 17-51 |
| | 6 | ధాతు-ఫాల్గుణము | 24 | మం॥ ద 40-53, శ్ర 39-23, రా 18-45 |
| | 7 | | 25 | బు॥ ఏ 38-20, ధని 3-34, రా 25-13, సర్వైకాదశి |
| | 8 | | 26 | గు॥ ద్వా 33-49, శత 35-49, రా 20-6 |
| | 9 | | 27 | శు॥ త్ర 27-34, పూభా 31-25, రా 22-32 |
| | 10 | | 28 | శ॥ చతు 19-56, ఉభా 25-39, రా 21-45 |
| | 11 | | 29 | ఆ॥ ● 11-29, రే 19-4, ప్రథమతిథి, వేదవ్యాసను, శకాబ్దాది. |
| | 12 | | 30 | సో॥ ప్ర 2-37, పుష 51-13, అశ్వి 12-11, ది 3-20, యుగాది, శ్వేతవరాహకల్పాది |
| | 13 | | 1 | మం॥ త్రి 45-23, భర 5-24, ఉప 53-41, రా 1-33, 7-52, ఉత్తమమను, సౌర సంవత్సరాది |
| | 14 | | 2 | బు॥ చ 37-39, కృ 53-37, రా 4-44 |
| | 15 | | 3 | గు॥ పం. 30-55, మృ 49-18, ది 6-36 |
| ఏప్రిల్ | 16 | | 4 | శు॥ ష 25-32, ఆర 46-16, ది 9-14, షష్ఠితిథి |
| | 17 | | 5 | శ॥ స 21-41, పున 44-43, ది 15-30, తిథిద్వయం |
| | 18 | | 6 | ఆ॥ అ 19-16, పుష్య 44-38, ది 4-42, నవమితిథి |
| | 19 | | 7 | సో॥ న 18-20, ఆశ్లే 45-58, ది 17-2, శ్రీరామనవమి |
| | 20 | | 8 | మం॥ ద 18-47, మఘ 48-37, ది 17-13, వృషభాయనం 29-49, ఏకాదశి తిథి |
| | 21 | | 9 | బు॥ ఏ 20-28, పుబ్బ 52-27, ది 9-54 |
| | 22 | ఈశ్వర సం॥ చైత్రము | 10 | గు॥ ద్వా 23-18, ఉత్త 57-22, ది 12-3 |
| | 23 | | 11 | శు॥ త్ర 27-8, హస్త 60-0, ది 20-23, మధురరథం |
| | 24 | | 12 | శ॥ చతు 31-57, హస్త 3-7, ది 25-19 |
| | 25 | | 13 | ఆ॥ ○ 37-29, చిత్త 9-44, ది 25-24, చిత్రాపౌర్ణమి కంచినదబాని. |
| | 26 | | 14 | సో॥ ప్ర 43-35, స్వా 16-55, రా 1-38 |
| | 27 | | 15 | మం॥ ద్వి. 53-4, విశా 24-35, రా 4-46 |
| | 28 | | 16 | బు॥ తృ 56-31, అనూ 32-25, రా 17-4 వాగీచరు |
| | 29 | | 17 | గు॥ చ 60-0, జ్యే 40-4, ది 2-25 |
| | 30 | | 18 | శు॥ చ 2-40, మూల 47-7, రా 11-30 |

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 3. అర్ధసంవత్సరపుచందా రు. 1-8-0 అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతి లేదు. విడికాపీ రు. 0-4-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటన రేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకతూరికి పూర్తిపుటకు రు. 20 0 0 అరపుటకు రు. 12 8 0 కాలుపుటకు రు. 8 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలముల రేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈపటుకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులు వ్రాయజాలము. రిప్లయికార్డు వ్రాసిననే జవాబు ఈయబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదని వ్రాయుచో తిరుగ కాపీలు పంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులను ప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావుగారు.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
హైదరాబాదు: ఎస్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు. (పెద్దచావిడి దగ్గర)
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని
జెమ్‌షెడ్‌పూర్: వి. కొండల్రావుగారు, అకౌంట్సు ఆఫీసు.
బరంపురం: ఎస్. కె. మూర్తి అండ్ సన్స్. గుంటూరు: వెల్‌కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.
పిఠాపురం: ఎం. సూరిరాజుగారు, ఆంధ్ర న్యూస్‌ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
ఏలూరు: డి. శ్రీహరిరావుగారు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూస్‌ఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్‌పేట.
ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
నిడదవోలు: కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్ గారు.
కాకినాడ: నున్నా బాలకృష్ణరావుగారు, న్యూస్ బాయ్ అండు కో.
భీమవరం: వంగల అచ్యుత రామయ్యగారు, మేనేజరు, అశ్విన్ కుమార్ ఫార్మసీ.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో. గుడివాడ: శ్రీ శివరామ అండు కో.
అమలాపురము: పి. అన్నాజిశర్మగారు. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)
మచిలీపట్నం: ఆచంట లక్ష్మీనరసింహంగారు, సర్కిల్ పేట.
కర్నూలు: టి. బాలనాగయ్యశెట్టిగారు, బాలసరస్వతి బుక్ డిపో.
అనకాపల్లి: సివాజి న్యూస్ ఏజన్సి. కడప: ఎమ్. నరసింహంగారు, న్యూసుఏజంటు
కాళహస్తి: యస్. అబ్దుల్ అజీజ్ సాహెబ్.
తుని: అల్లాడ బాపిరాజులింగంగారు.
పోనూరు: జి. సూర్యనారాయణగారు,
హనుమకొండ: వరంగల్లు: కంభంపాటి అచ్యుతానందంగారు.

హిగిన్‌బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లుకావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు